# మహా ప్రపంచము

Complimentary Copy.





M. V. KRISHNA RAO
Minister for Education & Cultural Affairs,
Executive President,
WORLD TELUGU CONFERENCE
HYDERABAD 1975.

రచన:

నీలా జంగయ్య

హైద్రాబాదు.



శ్రీ టి. జగదీశ్వర్
(సదాశివపేట)



శ్రీ ఇల్లెందుల పద్మనాభం
(కట్టంగూరు, నల్లగొండ)

1

# నా గొడవ

'మహాప్రస్థానం' జరిగింది., 'మహాంధ్రోదయం' అయింది. 'జలపాతం' దూకింది. 'నాగార్జునసాగరం' వెలసింది. 'కర్పూర వసంతాలు' వచ్చినవి. వీటన్నిటినిచూచి 'మహాప్రపంచం' బైట పడ్డది. 'మరోప్రపంచం' వద్దనే 'మహాప్రపంచం' యిది. దీనిలో 'అగ్నిధార' లు, 'రుద్రవీణ' లు వున్నాయట. మహాప్రపంచ నిర్మాతకు 'శాస్త్రాలు, వ్యాకరణములు, పాండిత్యము, అలం కారాలు' తృణంగా తోచాయి. ఆయనకు 'రాయబోతే శబ్దము రాదు. రాతామన్న శబ్దాలులేవు.' ఆయన 'తెలియనివాడు.' తాను 'మహాకవి' నని తెలిసినవాడు. 'ఏ శబ్దము చూచినా బాగలేదు'; 'ఈ బలంలేని శబ్దాలు నన్నెలా మోస్తాయి?' అని సవాలు చేస్తాడు. తానే 'మోయలేవు' అని సమాధానంకూడా చెప్పు కున్నాడు. 'మిగిలింది ఒక రసానుభూతి.' అది 'ఎంత శృంగార మైనదో చెప్పజాల' డు. 'కృష్ణపక్షం' నుండి 'బ్రహ్మం' గారి 'తత్వాల' దాక అన్నీ చూచిందీ 'మహాప్రపంచం'.

సంప్రదాయం, సాధన మొదలగువానిలో విశ్వాసం లేని వాడు ఆవేశం పట్టలేక తనకు చేజిక్కిన కర్రముక్క కొసను చిత గ్గొట్టి కుంచెగా జేసుకొని తనకు తోచినట్లు రంగులువాడి తన ఊహాచిత్రాన్ని గీస్తే యెట్లా వుంటుంది? నృత్యం నేర్వనివాడు సిగంబూని తైతక్కలాడితే యెట్లా వుంటుంది? మాటమ్మయే చనుబాలకు నోచుకోనివాడు కేవలం భక్తిపారవశ్యంలో భగవం

తుని కీర్తిగానం చేస్తే యెట్లా వుంటుంది? సంగీతవేత్తలకు, సాహిత్యాచార్యులకు యేడ్చినట్లుంటుంది. కాని భగవంతునికి, అమాయకులగు భక్తులకు, బ్రహ్మానందంగా ఉంటుంది. 'మహా ప్రపంచం' నీలా జంగయ్య సృష్టి. అన్నివిధాల సామర్థ్యంవున్న బ్రహ్మదేవుని 'ప్రపంచం' మాత్రం యేమంత బాగున్నదని నీలా జంగయ్య 'మహాప్రపంచా' న్ని వంకలు పెడదాం. సృష్ట్యాదిగా యీ ప్రపంచాన్ని బాగుపరచాలని యెందరెందరో యెన్నెన్నో విధాల ప్రయత్నించినారు. ప్రయత్నిస్తున్నారు. కుక్కతోకవలె అట్లాగే వున్నది ప్రపంచం. మనంకూడా వంకలు పెడుతూ యేడుస్తు ఆ ప్రపంచంలోనే వుంటున్నాం. అవకతవకల ప్రపంచంలోనే హాయికై ప్రాకులాడుతున్నాం. శక్తికొలది హాయిని సాధిస్తున్నాం. 'మహాప్రపంచం' విషయంకూడా అంతే. 'మహాప్రస్థానాన్ని' తప్పించుకున్నామా?'కృష్ణపక్షం' చూడక తప్పిందా?'అగ్నిధార' ప్రవాహంలో మునగక 'రుద్రవీణ' చప్పట్లు వినక వుండగలిగినామా? 'జలపాతం' నెత్తిన దూకితే యేమిచేసినాము? 'నాగార్జున సాగరం'ఊళ్ళను మ్రింగితే యేంచేసినాము? తుదకు "నా గొడవ" మాత్రంవినక తప్పినదా ? అట్లాగే యీ 'మహా ప్రపంచం' కూడాచూడక తప్పదు. నాకు తప్పలేదు. మీకు తప్పదు.

"మహాకవి శ్రీ శ్రీ
మహాకవి దాశరథి
ప్రస్తావించితి వీ రిర్వురను
కదలినవి గుండెలు

కలము చేతబట్టినాను
వెలసింది 'మహాప్రపంచం'
నా జీవితము ధన్యమైంది"

మహాకావ్యం ముందురాస్తానని గట్టి నమ్మకముంది నీలా జంగయ్యకు. తనలో మహాకవి దాగియున్నాడని తెలుసు కొన్నాడు జంగయ్య. ఆయన్ని ప్రోత్సహించి ఆయనలో దాగి వున్న 'మహాకవిని' బైటికి రప్పించి, భావిలో ఆయనచేత మహా కావ్య నిర్మాణం చేయించడానికైనా మనం యీ 'మహా ప్రపం చాన్ని' చూడడం మంచిది.

నారాయణగూడ,
హైద్రాబాదు.
6—1—59.

—కాళో జి.

---

## ఒక అనుభూతి

"ఎటు చూచిన మా అమ్మే
అమ్మ పాదములపై బడి ఆత్మాలోచన చేసెద"

ప్రకృతి పురుష దృష్టితో సృష్టిని దర్శించి ప్రకృతికే ప్రాధాన్య మిచ్చిన వస్తుకవి శ్రీ నీలా జంగయ్యాగారు. ప్రకృతి పురుషులలో పురుషునికి సయితము ఆధారభూతమైనది ప్రకృ తియే. ప్రకృతి లేక పురుషుడు లేడు. పురుషుని అనేక విధముల అనేక రూపముల అనేక గుణములచే ప్రకృతి ఆవిష్కరించును.

అందుకే నామె ఆదిశక్తి, మహాశక్తి. ఆమె విశ్వరూపమును మాతృరూపములో దర్శించిన యువకవి ఈయన.

"ఏ శబ్దము జూచినా బాగలేదు
ఏదీ నా ప్రయాణాన్ని అంతు దేల్చవు."

సృష్టికి అంతులేదు. సృష్టి యందేయాత్రకును అంతు లేదు. ఈ యనంత యాత్రను యే శబ్దము వర్ణింప గలదు? శబ్దము అసంపూర్ణము. నిరంతర శబ్దముల అనంత రాగమాలిక ఈ జీవితము. ఇది కదా కవిత!

శ్రీ జంగయ్యగారు వస్తుకవి. అనగా సహజకవి. ఆయన ప్రతిభ అనంతము. ప్రకృతి దేవి అంతఃపురమునఁ జొరబడి అంతరాంతరములను అన్వేషించి రసమయ సౌందర్య రహస్య నిధులను సేకరించుట కవివృత్తి. కృత్రిమ సంపదను నిర్మించుట కాదు. సహజ సంపదను వెలికి తీయుట ప్రతిభ. ఆధునిక ఆంధ్ర మహాకవులందు ఇట్టి లక్షణములు కలవారు బహుకొద్ది. అందులో వీరొకరు,

"మహాకావ్యం నా యెదదలో వ్రాస్తున్నాను"—అన్నారీయన. అది సత్యము. ఆయన హృదయమే ఒక మహాకావ్యము. అది వ్రాసి ముగించిన కావ్యము. దాని నిక పఠించవలె. శ్రోతల కెరుక పరచవలె. సహృదయులను తన్మయ పరచవలె. ఇది మిగిలి యున్నది. ఈ పని ఈ కవి చేయగలడనుటలో సందియములేదు. ఇంతవరకు వెలువడిన రచనలు, ఈ మహాప్రపంచము, అందుకు నిదర్శనములు. ప్రపంచము ఎంత వైవిధ్యము కలదో ఈ మహా

ప్రపంచ కావ్యము అంత వైవిధ్యము గలది. ఇందులో పుష్ప ములు, ముండ్లు, రాళ్లు, పండ్లు, తేనెలు, తేనెటీగలు, మహానగ రములు, మురికి పేటలు, మంచి చెడ్డ లన్నియు గలవు. అందుకే ఇది మహాప్రపంచము. ఇది నవ రసాల కూడలి. ఇచట నిలచిన ఏ సహృదయుడైనను, ఏ రస మార్గము నైనను అనుసరించ వచ్చును. పరాకాష్ఠకు పోవచ్చును.

ఆదర్శములేని ఆధునిక సాహితీ వీధులందు అయోమయ ముగ ద్రిమ్మరుట మాని, నిర్దిష్ట రసమార్గమును చేకొని, హృదయ మునందలి మహాకావ్యమును సహృదయులకు ఇక వినిపించ వలసినదిగా శ్రీ జంగయ్యగారికి నా మనవి.

"అదుగో నింగిని చంద్రు డాడుచున్నాడు
చచ్చె నీశ్వరుడంటు చాటుచున్నాడు.
అందుకే ఇటు గంగ అవని వెలసినదో!
అందుకే అచటచట అగ్గివెలసినదో ?
కాక వల్మికాల కదులునా ఫణులు ?
విషము కొట్టులలో నెసగి అమ్ముదురా ?
ధరయంతయును నా కగాధమైతోచు
ఎవరి నీశ్వరుడంచు నే ప్రొద్దు దలతు."

ఇటువంటి కరాచిత్రములు ఈ కావ్యమునిండ అనేక ముగ నున్నవి. కవిని మహాకవిని చేయగలది భాషాపాండిత్యము గాదు. భావనా వైశిష్ట్యము, స్వభావ సౌందర్యవిశ్లేషణము. ఒక మహాకావ్యము ననువదించుట మహాకవిత్వము కాజాలదు. ప్రకృతి

7793



యందలి మహాసౌందర్యమును భాషారూపమున కనువదించుట మహాకవిత్వము. అట్టి కవి శ్రీ జంగయ్యాగారు. ఆయన నాశీర్వదించుచు, ఆయనచేసిన మహాకావ్య వాగ్దానపు చెల్లింపుకై నిరీక్షించుచున్నాను.

—బోయి భీమన్న.

# నిజం నిజం

"బాల గీతాంజలి"తో కవితాంజలి ఘటించి వేదనాభరిత హృదయముతో 'ఆవేదన' వెలువరించి, 'స్నేహావల్లరి' గామారి 'సుమమాల' ను రచించి, కవిద్వయ విపంచికలో 'విప్లవస్వరాల' వినిపించి, నేడు 'మహాప్రపంచ' యాత్రకు సోపానాలు నిర్మించి ఆశాజీవియై భవిష్యత్తు వైపు మనోనేత్రము విప్పి ప్రకృత్యధ్యవేక్షణ జరుపుచున్నాడు నా మిత్రుడు నీలాజంగయ్య.

అనంతమైన శబ్దప్రపంచములో, లేచే ఉవ్వెత్తు భావతరంగాలలో లీనమై, భువనఘోష వినిపిస్తూ, దీనుల హీనుల బాధా సర్పదష్టుల తాడిత మనస్సులకు శీతలజలసేచనముచేసి ఉత్తేజపరచి, మహాప్రస్థానము సాగించిన కవుల అడుగు జాడలలో నడవడానికి యువకవి సోదరులు ఉద్యుక్తులైనారు. తరుగని చెరుగని ధైర్యతో మనోస్థయిర్యంతో కుటిల మానవ సమాజాన్ని సవాలుచేస్తూ—

"కూడు గూడు గుడ్డ లేక
బీడుపడిన బ్రతుకులెన్నో!"

అవి చూపెడుతూ– "ఎవరు వ్రాసిరి ?" అను శీర్షికలో

"దానిసత్వపు దాటలందున
వాడిపోయిన ప్రాణులెన్నో!
జాలిగుండెలలోని బాధల
జోలి దాగిన శూలలెన్నో
హాలము బలమును కలిగినట్టి
పొలము చాలని రైతుబాధల
కలము తెలివియు కలిగినట్టి
నిలువజాలని కవుల గాధల"

ఎవరు వ్రాసిర(?)ని ప్రశ్నిస్తూ చారిత్రిక చీకటికోణంలో పడిపోయిన దానిసత్వపు పీడితులను జాలిగుండెలలోని బరువు బాధలను, పొలములేక యిడుమల పిడికిలిలోపడి నలిగెడి రైతు స్థితిని–తెలివికలిగి సమాజములో గౌరవప్రదంగా జీవించలేక పడే కవులపాట్లను, కరుణరస ముప్పతిల్లునట్లు,ఆలోచనల రేకెత్తించు నట్లు నివేదించి "అందరికి కూడు గూడు గుడ్డ" లుండాలని ఆశిస్తూ—

"ఒకరి నొకరిని మ్రింగివేసే, ఒకరి నొకరిని యేడిపించే
రాక్షసత్వం, దారుణత్వం సమసిపోవా" లంటూ

వైతాళికుడై

"నా కవిత్వంలోని సారమ్
ఎంతదీసిన యింతెనోయ్"—
అని స్పష్టపరుస్తాడు.

"బ్రహ్మరాక్షసులు. మేడలు, బుద్బులు, రాజరాజా, నా గొడవ, త్రిశూలజోస్యం, రాచకీయపు కవిత, కవులు, రైతులు,

మహాప్రస్థానము" శీర్షికలలో సమాజాన్ని పరిశీలించి గూడు కట్టుకపోయిన పెత్తందారి భావాలను వ్యతిరేకిస్తూ సమూలంగా మారాలని సమాజముపై తన భావాలను వ్యక్తీకరించాడు.

"భయ నిర్భయులు"లో, మానవశక్తి అన్నిటికి అతీతమైందని ప్రకటిస్తూ, "ఆవేదన నివేదనం"లో

"ప్రపంచములో జీవిస్తాను

ఉద్ధరిస్తాను లోకాన్ని" అని తన ప్రగాఢ విశ్వాసాన్ని, జీవితధ్యేయాన్ని "మానవుని"పై విశదపరచాడు.

కవితోపాసనచేస్తూ, యిడుముల పరవడిలో జీవితములో నలిగినా- నిలచి, విజయధ్వజాన్నెగురవేయడానికే ప్రయత్నిస్తున్నాడు. రచయిత రచనలనుగాక అతని ఆశయమే నన్ను ఉద్దీపింపచేస్తుంది. కొత్తపోకడలలో-సూటిగా యోచించి మేటి రచనలు సాగించి తన ఆవేదనకు శాశ్వతమైన రూపును కలిగిస్తే నిజంగా ఆరోజు నాకు సంతోషం.

"మనకోసం నిరీక్షిస్తూ
మహాయుగం ముందున్నది" అని భావించి,
"పీడితయుగాన్ని కోరు పెద్దరకం మొద్దురకం

తలకాయలు వారగనిదే ధరిత్రి కెక్కడిది చలువ" అన్న సంపత్ రావు కవివలుకులు రూపించే యుగస్థాపనకై నామిత్రుడు పాటుపడితే నిజంగా నాడే శ్రమజీవి అని భావిస్తాను.

"అందరిది ఈ వస్తుసముదాయమంత
కడుపుగాల్చుక ఎవడు కష్టపడరాదు"

హైద్రాబాదు.
6—1—59.

—జి. శ్రీనివాస్.

# ఆశీస్సు

చి॥ నీలా జంగయ్యా మంచి భవిష్యత్తుగల యువక కవి. ఇదివరకే "బాలగీతాంజలి", "ఆవేదన" మొదలగు అనేక కృతుల నొనర్చి, పద్య గేయ రచనల యందు సాధన జేసి శ్రీదాశరథీత్యాది కవుల మన్ననల పొందినారు. కవికి కావలసిన సామగ్రియు, ఆవేదన, ఉద్రేకము, సంస్కారము యితనికి యున్నవనుట సత్యము.

ఈ మహాప్రపంచమను కావ్యసంపుటియందు పైగుణము లన్నియు కనబడుచున్నవి. ఇందు గద్యములును కలవు. 'కవిపలుకులు' అను శీర్షికలో తననుగూర్చియు, తన యాశయములను గూర్చియు విపులముగా తెల్పినారు. ఇతనిలో నేదో అనిర్దిష్టమైన అసంతృప్తి కనపడును. దానితోబాటు జాత్యభ్యున్నతికి పాటు పడవలెనను "తృష్ణ" కూడా కలదు. ఇతని నినాద మీదిగువ పాదము లలో నిమిడియున్నది.

"ఇదే ప్రపంచ నినాదము నాది
మరో ప్రపంచ మహత్వసమాధి"

కవికి సంస్కారముతోబాటు, "లోకశాస్త్రకావ్యాద్య వేక్షణము" కూడా అవసరము. ఇతనింకను జ్ఞానవృద్ధుడై ఖండ కావ్యములనుగాక మహాకావ్యములు వ్రాసి దేశభాషాసేవ చేయుగాక యని యాశీర్వదించుచున్నాను.

శాంతినికేతన్ కాలని,
చిక్కడపల్లి,
హైద్రాబాదు.

ఇట్లు,
కురుగంటి శీతారామయ్యా

# స్నేహవల్లరి

శ్రీవిష్ణు పదపద్మ చింతనామృతపాన
మత్త మానస వినిర్మల మనీష!
నీ ప్రమోల దౌష్ట్యంబు నెఱప బూనినవారు
విజయంబు గనరు దుర్విషయరోష!
లాలించుదురు నిన్ను లాక్షణికుల్ సదా
సుకవితా మధురిమ ప్రకటతోష!
జంకు గొంకులులేక సత్కథల్ ప్రకటించి
పతకముల్ బడయు శోభావిశేష!

గర్వ మెరుగకీవు కార్యనిర్వాహణ నె
య్యమునఁ జేయుచుండు టబ్బ మవని
గానకళ యొకింత గడియించి పేర్గాంచి
రుజల థూ! యటంచు రోయుమయ్య.

గురుని సేవించి వాగ్దేవిఁ గొలచినావు
కవిత లల్లి యశంబును గాంచినావు
కవిశిరోమణి ధన్యత గాంచినావు
కవుల పాలిటి కల్పవృక్షంబ నీవు.

పురుషరత్నమ భవదీయ బుద్ధి నెంచి
వృద్ధకవులెల్ల రాశ్చర్య వివశులగుచు
భారతాంబిక నోములపంట యీత
డంద్రు నిత్యంబు నిత్య ప్రహర్షమునను.

## మిత్రవాక్యము

అదిగో కవితా కన్నియ
సరస సంభరితాత్మ! నీలా
జంగయాఖ్య కవీంద్ర! హృ
త్సరసిజంబున వెల్గుచున్
సదా ముదంబును గూర్పగ
సరిగమల బాడుచు మనోహర
ఛందముల వివరించుచున్
ధరణి మెల్గుచున్న దహాహా !
దయను నిను లాలింపగన్.

దేవరకొండ }
2—1—59 }

ఇట్లు,
అజ్మతుల్ల

---

# కావ్య విషయం

ఎవని హృదయం ఈ మహాప్రపంచమంతగా గాయపడి, సప్తసముద్రాలలో నుండే నీరంత రక్తము కారుతు, భూఖండాల యంతటి కండలు గ్రక్కుచు వీచేగాలియంత దుర్గంధం వ్యాపించే యట్టుగ ప్రపంచసృష్టియంతయు కిటకముల పాటవమై, హా! యని పరితపించుచున్నదో అట్టివాడే మహాకవీశ్వరుడు. వాడే మహాకావ్యం వ్రాస్తున్నాడు. దానిని చదువుకొనువాడు భుక్తి ముక్తి సాధిస్తున్నాడు.

పర్వతాలవలె సుస్థిరత్వము జాటునట్టి ఎముకల బలము గలిగి, నిర్భీతిని నిరూపించు హిమపర్వత బుద్ధితో, కరుణారసము జాలువారునంతటి గంగాపాతముగా సర్వ ప్రపంచాలను సస్య శ్యామల మొనర్చి, జీవదేవతగా ఉద్ధరింప జేయుచున్నదో అదియే మహాకావ్యం.

ఈ మహాకావ్యం ఆచంద్రతారార్కముగా, చీకటి-వెలుగు-సూర్యుడున్నంత కాలము, శాశ్వతముగా నిలుస్తుందని ఈశ్వర సాదృశుడనై నే నీలోకానికి చెప్పుచున్నాడను.

మహాశక్తి పార్వతి—చీకటి.

మహాతపస్వి ఈశ్వరుడు—వెలుగు.

వీరిర్వురకుమారుడ నేను—ఉదయం రవిగా, మహాకవిగా మహాకావ్యం వ్రాస్తున్నాను. దానికి పేరు సనాథ.

నాకు గురువెవ్వడూ లేడు. దానితోపాటు శిష్యుడు గూడా లేడు.

నా ఆశాలతల నండగా జేసికొని ఎవరు చూడరానియట్టి రేఖానుభూతిని దర్శించి ఏ ఉపమానంతోనైనా చెప్ప లేక నాలో నే నేడుస్తూ మీ ముందు సంతోషిస్తున్నాను.

ఈ ప్రపంచములో తెలిసినవారు యెవరు? అను నాలో ఏర్పడిన ప్రశ్నకు తెలియదు అని తెలిసినవాడే, తెలిసి చెప్పరాక తెలియదనువాడే మహాకవి. మహారవిగా నిశ్చయించుకున్నాను.

ఏది చెప్పినా మహాకవికాడీలోకములో.

కవులు అనే వారిలోకములో అందరు—భావుకులు.

పండితులనే వారిలోకములో అందరు—శబ్దయుతులు.

కాని మహాకవులు ఈశ్వరాయత్తమై తెలిసి తెలియని వారై ఈ లోకములో జీవిస్తున్నారు.

కవులు, చచ్చిపోయినవారు చచ్చిపోయేవారు. కాని- మహాకవి మాత్రం చావక ఈశ్వరుడై పోవుచున్నాడు.

ఈ లోకంలో గల కవులు ఏడ్చేవారు.

ఈ లోకంలోగల పండితులు తెలియనివారు. భావం ఈశ్వరుడు. శబ్దం పార్వతి. వీరిద్వారి కలయికతోగూడిన రచనయే ఈ మహాప్రపంచం. ఇదే మహాకావ్యం.

ఈ కావ్యం అందరు చదువుకొనే కావ్యం. సమస్త విషయాలు దీనిలోనే కలవు.

"కనటానికి కనులు రెండు
గ్రహించుటకు జ్ఞానమొకటి
వినటానికి చెవులు రెండు
అనటానికి నోరొక్కటి."

ఇది నా తత్వసారము. ఇది నా ఆలోచన. దీనిని అనునిత్యం ధ్యానిస్తున్నాను. నా యీ మహాప్రపంచ కావ్యమును గూడా! నారసింహాకృతీశ్వరునకు అంకితం చేసినాను. మోయగలడీ విశ్వభారమును వాడే. శుభంబగుగాక ఈ జీవకోటికి.

విశ్వమ్. మంగళాని భవంతు.

# చిన్నవాని సందేశము

స్వర్గభోగముల ననుభవించవలెనంటె నడుములు బిగించి
భూమిదున్ని చూడాలోయి
భూమిలోగలవెన్నో స్వర్గాలు
దున్ని పండించిన ధాన్యంతో అనుభవిస్తావు హాయిని నాడు
చచ్చి దేవునిజూచే వేదాంతం నాకొద్దని
బ్రతికిచూచే యానందమే బ్రహ్మానందమని
ముక్తకంఠమెత్తి భేరీనినాదాల మ్రోయించి చెప్పాలోయి.
ఇదే కవిత్వమని చెప్పాలోయి
ఇదే అమరమై పోవాలోయి.
ఆకాశ మెంతయున్నదో
భూమిగూడా అంతేయున్నదని
భూమిలేని నాడు ఆకాశం ఏమైతేనేమి?
భూమియే గొప్పదైవమని సాదృశ్యముతో
తల్లియని దున్నిచూడండోయి స్వర్గమవుతుంది.
కనుపించని గగనస్వర్గము కాలిపోయిందని
అగుపించే ఈ భూమియే అమరలోకమని బ్రతుకండోయి
నామాటలు బాగా తెలియండోయి.

---

# నా నుడి

అయ్యలారా! నా మనవి ఏమనగా, ఈ ప్రపంచమంత ఒక ఘోష. నాదో ఏడుపు. భారత మనుచరిత్రాదులవలె నేను కవిత్వము చెప్పుతానని మీరనుకొన వచ్చును. కాని నేను

తిక్కననుగాను, పెద్దననుగాదు. పోతనవలె భాగవతము వ్రాసి నాడని ఊహిస్తారేమొ, అదియును నానుంచి కానిపని. నేను పోతన్ననుగాదు. ముద్దు పలుకులు పలుకుటకు ముక్కుతిమ్మనను గాదు. తుదకు ఎద్దుకవినిగాదు మొద్దుకవినిగాదు. నా పేరు జంగయ్య. నాకు తోచింది వ్రాసినాను. దీనికి పేరు మహాప్రపంచము. అచ్చువేసిన పుస్తకాలే కవిత్వముగా చలామణి యగు చున్న కారణముగా, దీనిముద్రణకు నాప్రయత్నము జరిగినది.

శ్రీశ్రీ, దాశరథి కవులవలె గుండెలుమండి వ్రాసిన కవిత్వము ఆంధ్రావనిలో తరచుగా కానుపించును. ఎక్కడైన ఉన్న వీరిద్దరి గర్జనకు ప్రతిధ్వనియేయని నాకు తోచినది. ఈమధ్య నాకుకూడ గుండె మంటలు లేచినవి. కవిత్వమంటే ఏమిటిరా యని పర్వడిన ప్రశ్నకు, శబ్ద సమన్వయమని కొందరు, రసప్రధానమని కొందరు, నీరసమని మరి కొందరు. డిటెక్టివ్‌లను వ్రాసి బహుగా ప్రచురిస్తూ వచ్చారు. మనిషి యెన్ని పుస్తకాలు చదువుతాడు? ఏవో కొన్ని చదివి విసుగొచ్చి ఊరుకుంటాడు. తుదకు ఆలోచన మించి వేదాంతం ప్రవేశించి, ఎన్ని చదివినా చావు దప్పదని నిర్ణయించి, ఏవో ఊహిస్తుంటారు. ఆ ఊహాలకు ఎన్నికళ్లాలు ? అడవిలో వుందామంటే పులులబాధ, ఊళ్ళో వుందామంటే ప్రభువులబాధ! తుదకు పూర్వపద్ధతి నవలంబించవలసి వస్తుంది. అలాగే నేను మరల పుస్తకాలు చదువ ప్రయత్నించి నాను. దాశరథి "అగ్నిధార, రుద్రవీణలు" శ్రీశ్రీ "మహాప్రస్థానము" ఈ మూడు గ్రంథాలను యిద్దరి హృదయాలను బాగా

చదువుకొన్నాను. కాని, శ్రీశ్రీ వలె గేయం, దాశరథి వలె పద్యం చస్తే వ్రాయరాలేదు. తుదకు దాశరథి పద్యం సాధ్యం గాక, శ్రీశ్రీని వెంబడించినాను. గేయములు అవ్విధములుగనే లేకున్నా వాని నడకలు స్ఫురింపచేసినాను. కవిత్వ విషయంలో నాకొక తపస్సు వున్నది. ఆ తపఃఫలసిద్ధి కాకపోయినా, కొన్ని స్థితులు అవగతమయినవి. నాయీ మహాప్రపంచమను గ్రంథంలో గద్య పద్య గేయ రూపముల వ్యక్తంచేసినాను. అంతగా వ్యాకరణాధ్యయనంలేని కారణమున కొంత వాడుక భాష, మరి కొంత గ్రాంధికము, ఆంధ్రము, సంస్కృతము కలిపి నా భావాలను వ్యక్తం చేసినాను. శ్రీశ్రీ, దాశరథుల ఊహాంచలాలలో తిరిగే శక్తి నాకు లేకపోయినా, వారంటె నాకు మహాకవులనిపించినారు. మీకుకూడ అంతె.లోకములో చేసేదానికన్న చెప్పేదెక్కువైనది-క్రియారూప రహితమైన ఉద్యమాలు, నీతిబోధలు వేదాంత మార్గమని ఊహించి. ఈ గ్రంథము వ్రాసుకొన్నాను. ముప్పుతిప్పలు కవిత్వానికి మొదటినుండియున్న మాట క్రొత్తది కాదు. అది నాకు తప్పదు. "వేళకాని వేళలో, నీలోనే నీవేదో ఆలపించుతావ్." శ్రీనివాసరావ్ అన్నట్లుగానే నా.గతియంతే యైపోయినది. ఏ కావ్యము మంచికి, చెడ్డకు, జనులే నిర్ణయాత్ములు. గనుక మీరే భావించి నిర్ణయించి నన్ను ధన్యుని జేస్తారని ఆశిస్తూ ముగిస్తున్నాను.

రచయిత.

# కృతజ్ఞతలు

నా పురోగతి నిరతి నభినందిస్తూ, సానుకూల విద్యా వ్యాసంగానికి ప్రేమపూర్వకముగా, ఆదరహితులై నాకండగా ఉంటున్న శ్రీ కె. సి. గుప్త, "గుప్త" పత్రికా సంపాదకులకు; మరియు నామిత్ర రత్నములలో ఒకరైన శ్రీ గార్లపాటి దశరథంగుప్త (దేవరకొండ వాసులు), నాయెడ బంధువురీతి సానుకూలము జూపుచున్నందుకు; సవయస్కులైన శ్రీ పానుగంటి కృష్ణమూర్తి అన్నయ్యకు; శ్రీ రామిని నరసింహులుగారికిని; సదయ హృదయానుకూల సంవర్ధిత పరివేష్ఠిత కల్పలతిక వోలె చూచినంత నానందిస్తు; నారచన వారి దివ్యవచనమున బాగున్నదనుచు పలుకు, శ్రీ కోణిజేటి వెంకటరత్నం అన్నయ్యకును ఎంతగానో కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

మఱియు నే నీ గ్రంథమచ్చొత్తించుటకు ఆశ్రయించిన వారిలో అర్థసహాయమొనర్చిన దాతలు—

పూజ్యులు శ్రీ కొత్తూరు సీతయ్యగుప్తగారు (శాసన సభ్యులు), ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ మాజీఅధ్యక్షులు శ్రీ బెల్దె కుమారస్వామిగారు, ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభాధ్యక్షులు శ్రీ దండు వెంటయ్యగారు, (ప్రముఖ వ్యాపారస్తులు) శ్రీ కె పరమయ్యగారు, (ప్రజాసేవకులు) శ్రీ బి. గురుమూర్తిగారు (శాసన సభ్యులు.), "సంఘోద్ధారక" శ్రీ జూలూరు వీరేశలింగం గుప్తగారు,(మాజీవర్తక సంఘాధ్యక్షులు) శ్రీ ఉప్పల వెంకన్నగారు (సూర్యాపేట), (ప్రముఖ వ్యాపారస్తులు) శ్రీ కల్వా సూర్యనారాయణగారు, (పేపరు వ్యాపా

రస్తులు) శ్రీ గోలి ఈశ్వరయ్యగారు, (పేపరు వ్యాపారస్తులు) శ్రీ బచ్చు లింగయ్యగారు, పై వారలందరకు భగవానుడు చిరాయు రారోగ్యభాగ్యముల ప్రసాదించి,సదా రక్షించుగాక యని ప్రార్థిస్తున్నాను. మరొక్క మాటతో ముగిస్తాను. శ్రీ ఎల్. నారాయణ (నగర సోషలిష్టుపార్టీ శెక్రటరీ)గారు, శ్రీ తడుకమళ్ళ శంకరయ్యగారు(సదాశివపేట) ఈ గ్రంథానికి ఆర్థికముగ సహకరించినారు. వారికి నా ధన్యవాదములు తెలుపుచున్నాను.

"చెట్టు కంపగా నగుపించి చివర పూవులుంటాయి" అది అనుబంధము. "కావ్యము చెత్తగా నగుపించి, గాయం అగుపడుతుంది"- అది ప్రబంధం.

"తస్కరయోధులకుగాక దైవభక్తులకు నెట్లు
సాయపడును లోభిధనము"- సత్యమైనమాట.
"కీర్తికాములకు ద్రవ్యం ఆర్తజనుల సముదైవం
విశ్వశాంతి బుధులమాట లశ్వరములుగావు"-నిజం.

---

# అంకితము

శ్రీ యాదగిరి శ్రీలక్ష్మీ నారసింహా!
పాపిష్ఠి నరు డహంకార రాక్షసుడయ్యీ
కోపిష్ఠిగా, లేడు హరి, నేనెయని బల్కు
ఆ హిరణ్యాకశ్యప ద్వేష దావాన
లమున క్రాగెడు భక్తప్రహ్లాదు రక్షింప
దుష్టరాక్షస గదాఘాత సంఘాతమున
ఉక్కుస్తంభము నుద్భవించి-నరసింహా కృ

తిం దానవాంతక మొనర్చిన విధంబు
నరహంతకుల నటులె హరియింపవలెనంచు
కడుభక్తి ధ్యానించి కథ నాది వివరించి
అంకితం బొనరింతు నందుకో నారసింహా! ఆత్మపూర్తిగను-
మెత్తని హృదయాన్ని కత్తులతో బొడిచారు
గాయపడు హృదయాన కారాలు జల్లారు
అప్పు డాహా! నారసింహా! యటంచు ని
న్నాత్మ సంభావించి హాయిగా స్మరియించి
ఇస్తున్నా నీ గ్రంథాన్ని అందుకో అంకితం-
నీకొరకు పరుగెత్తుకొనివచ్చు భక్తుని కాళ్ల
సందున కట్టెల విసరు మానవతతికి,
మా కవితదప్పు అన్యులది కవితగాదనెడు
అన్నయ్యలందరకు నాదరమ్మున మ్రొక్కి-
బుంగమూతి ముఖాల కొంగి దండముబెట్టి,
కొంగజపహాగ్విభయ లింగాయతుల దల్చి,
అన్యాయముగ కొంపలార్చి పేదల నోళ్ళ
మట్టిగడ్డలగొట్టి పరమాన్నముల దినెడు
నాయకుల చతురతకు నానాకృతుల మ్రొక్కి,
నాకథా కథనమ్ము నానుడుల జెప్పెదను
మార్గమున దర్శనంబైన యామునిమాట
లన్ని ననుగూర్చి నిజమాడిన ఔ తె నే
నిన్నుకోరెడివి కొన్నిమాటలే తండ్రి!

1. అష్టదరిద్రదేవతకు నాయిల్లు నివాసము కానీగాక
విశ్వదాత కీర్తి పిపాసకు నాహృదయం పరితపించుగాత.

2. సమస్తమాయవిద్యా గారడీ తంత్రములు నాకు రాకుండుగాక
వచ్చిన విద్య ప్రజావిపత్సమయాలను కవితాకృతి గానం చేసు
కొనుటకు శబ్దజాలము సానుకూలమగుగాత.

3. పరమలుబ్ధుల ముందు ప్రణుతిసల్పేపని నాకు రాకుండుగాక
దాతృత్వమును నశింపజేసే పాడుద్రవ్యము నాచెంత
నుండకుండుగాక.

4. సర్వద్రష్ట మహారోగబాధలు మొదలైనవెల్ల నాకెటు నూరు
యోజనాల దూరమై పోతుండుగాక.

5. చదివినంతనె పుస్తకములోని మంచి నామస్తిష్కమున సదా
విషయ విదాగమమై చెదరిపోకుండనుండుగాత.

6. కపటనీతియుత గ్రంథాలు నాదృష్టిలో బడకుండ ఎక్కడో
యుండుగాక — ఇంతవరకుంటె అంతేచాలు.

వాండ్లు తుడుసుకపోయినా
నేను రాసుకపోయి పూసుకతిరిగి-
వాండ్లు కోపించినా శాపించినా సంతోషించి
ముసిముసి నగవులు మూపెదవుల వెలార్చి-
గుండెలోనుండే వేదనా జ్వాలలను బాధలను
శోకముగా ఒక్కమారు నా
అష్టదరిద్ర మృత్యుదేవతను మనసార స్మరించి-
దీనుడనని హీనుడనని నా

జననీ జనకుల గర్భభార దుర్భరవేదనాతత్పరుడనని స్మరించి, అన్నిమతాలకు, అన్నికులాలకు, అన్ని ప్రభుత్వాలకు, అన్ని దేశాలకు, అన్నిలోకాలకు, అన్ని దేవతలకు, కడుగా మ్రొక్కి-ఈశ్వర కరుణాకటాక్షమున జీవిస్తున్న నా యీ ఆవేశధారా వాహినినైయైన, ఈ మహాప్రపంచమును నాభావ విలసమున, నీ దివ్యరూపమునకు అంకితం చేస్తున్నాను. నారసింహా! జాలిగల దేని అందుకో.

## తలనువంతు

తలనువంతు విశ్వదాతకు ధాత్రిని
కలముబట్టి వ్రాతు కవిత సతము
నిత్యమైన తనువు సత్యంబు బల్కదా
సత్యమాడకున్న చావుమేలు.

కవిత వ్రాయ వ్రాయ కవి పండితుండౌను
పండితుండు శాస్త్ర పఠనసల్పి
కవియుగాడు నైయైన కవియని నుడువాతె
నీలవారిమాట నిజము సుమ్ము.

బండల పిండనిచ్చునె పిసాసికి దప్పి దీర నీరు లు
బ్ధుండు యథాప్రకారమె ప్రభుండటుగాదు తలంప దివ్యమే
ఘుండవనీ కృపాబ్ధియన గూర్పడె క్షామమువేళ నిచ్చును
ద్దండత కామధేనువెగదా యెవదల్ప ఖరంబులెన్నియే
నుండిననేమి భూమి సమయోచితసిద్ధ ప్రబుద్ధసూక్తికిన్.

*అన్యాయం అయఃపింతమైతే, అటం మహాగ్నియై మండుతుంది.*

221

## కవి పలుకులు



నేను మహాకవి నైతి
ఐనా తెలియనివాడను
ఎటుపోయిన అంతులేదు-
ఎటుజూచిన మా అమ్మే-
అమ్మ పాదములపైబడి
ఆత్మాలోచన జేసెద
ఏమిజేతు దాశరథీ !
ఏమిజేతు దాశరథీ !
నీ రుద్రాగ్నియె నాలో
నిండెనురా జ్వాలాకృతి
జ్వాలాకృతి మహాకవిగ
కలాలందు నింప దలచి
రాయపోతె శబ్దము రాదు
రాతామన్న శబ్దాలు లేవు
ఏ శబ్దము జూచినా బాగలేదు
ఏవి నా ప్రయాణాన్ని అంతుదేల్చవు-
ఈ బలంలేని శబ్దాలు
నన్నేలా మోస్తాయి! మోయలేవు
తుదకు నే 'ఊ' యని మూల్గ
వలసి వచ్చినదోయి
నాకు అవధులు ఛందస్సులు
శాస్త్రాలు వ్యాకరణములు
పాండిత్యము - అలంకారాలు

తృణంగా తోచాయోయి
నిఘంటువులు మరింకెన్నైనా
నిజంగానోయి నిజంగానోయి
మిగిలింది ఒక రసానుభూతి
ఆ రసానుభూతి ఎంత శృంగార
మైనదో చెప్పజాలను—

భావప్రదమైన ఆ అనుభూతికి మాత్రము, అవి నల్లని చీకట్లు. ఆ చీకట్లలో ఏదోయొక వెన్నెల. వెన్నెలకొరకై చీకట్లు ఉరుకుతున్నవి. చీకటిపై వెన్నెల విహరిస్తుంది. వెన్నెలపై చీకటి ప్రసరిస్తుంది. ఈ కనుపించే లోకమంతా అందులోనే పుడుతున్నట్టు తోస్తుంది. అంతలో తెలవారుతుంది - కన్నులకు వెలుగు, నిస్త్రాణకు జీవం పోస్తూ భానుడుదయించాడు. వాని వెల్గులోనే జీవిస్తుంది లోకమంతా. జీవిస్తూ జీవిస్తూ హఠాత్తుగా మాయమై చీకట్లో చేరిపోతున్నారు జీవులంతా. నాకు మరల చీకటి కనిపించినది. దానిని చూడలేకపోతున్నాను. అవెల్ల యేమి చీకట్లురా! యని అనిపించి ఈ లోకమంతా "కృష్ణపక్ష" మని తోచింది. కృష్ణపక్షము లేక ఈ లోకము లేదు. చీకట్లే ప్రాణాలు. ఈ చీకటిలోనే కలదోయి సృష్టిరహస్యమంతాను.

అదుగో చీకటి
ఓహెూ చీకటి!
ఆహా చీకటి!
నా ప్రాణాలే చీకటి—
నా సంతోషమే వెన్నెల
నా జీవితమే వెల్గులు
వెల్గులనే భోంచేస్తాను

వెన్నెలలో విహరిస్తా
చీకట్లో నిద్రిస్తా
ఇదే నా జీవయాత్ర
ఇదే నా లోకయాత్ర—
ఈ యాత్రాంతము నెవ్వరు
చేయలేకపోతారోయి
ఈ యాత్ర మహా యాత్ర
యే యోధుడు అరికట్టడు—
ఇదే కావ్యవస్తువైన
ఇదే చిరంజీవమౌను
ఇదే చిరంజీవమౌను
నేను భావవిదుడను
నేను మహాకవినైనా
నేను కావ్యము వ్రాయలేకపోతున్నాను
ఎంచేత నంటావేమో
ఎటు తేల్చని ఈ సందేహము
మటుమాయము కావలెగదా
అపుడు రాస్తాను మహాకావ్యం—
మహాకావ్యము నా యెడదలో వ్రాస్తున్నాను
పుస్తకరూపము చేయలేను
అది నావరకే యుంటుంది—
అలాంటప్పుడు నేను మహాకవినని
ఎలా గుర్తించవలయునంటారు మీరు
నిజమే మీరు నన్ను అనవద్దు
నేనే మహాకవి ననుకునే సత్తువనని

గ్రహిస్తే చాలు అదే నాకు పదివేలు—
ఈ ప్రపంచములో తెలిసినవారు
కోటికొక్కరులేరు
అలా వుంటే దేవుడ్ని చూపించజాలును
ఒకవేళ వున్నా వారు మానవాధీనములై మెల్గరు
ఇది నాకుతోచిన యితివృత్తం.
నా కవితావేశము నూత్నలోకాన్ని
సృష్టిస్తుంది కాని పోషించ అసమర్థమై
కాళ్లు ముడుచుకున్నది
నా ఆవేశం నేనే మ్రింగుతున్నాను
వస్తున్నాను దాశరథీ! వస్తున్నాను
నీ యమోఘ భావప్రపంచములో
నేను నీ ముందు నిల్చుంటాను
ముచ్చటించుకుందాము లేదా
మురిపాలాడుకుందాము
కాదంటావేమో
కవి రసస్రష్ట కదా!
నీవాడు పలుకు కర్ణకఠోరంగానే యుంటుంది—
నీ డెందములో కదిలే సత్యం
ప్రేమాన్వితమైనది
లోకానికి శిరోధార్యము....సత్యము
అర్థముగాని భాషలో
ఆయాసపడదు నా కవిత్వం
అవిగో! అవిగవిగో!
నా ఎదుట నాలుగున్నవి

ఆ నాలుగింటిని పరిశోధిస్తున్నాను
అవి మహా పర్వతాలు
ఒకటి భూమి, మరియొకటి చెట్లు,
మరియొకటి జీవరాసి, మరియొకటి మేఘాలు
భూమి అగ్గిపర్వతము మేఘము జలపర్వతము
చెట్లు పచ్చలపర్వతము జీవములు సంజీవపర్వతము-
ఈ మేఘ పర్వతములో ఎన్నో ఆటం
బాంబులు ఉన్నవి రైళ్లు ఉన్నవి
ఎలక్ట్రిసిటి ఉన్నది, చంద్రలోకానికి
ప్రయాణముజేసే యంత్రాలు తయారవుతున్నాయి
వీటన్నిటిని తయారుజేసే
మహామానవులు ఉన్నారు
పులులు సింహాలు కాకులు గ్రద్దలు
ఎద్దులు మొద్దులు ముద్దుగుమ్మలు
చెప్పరానన్ని జీవకోటులు
కొన్నికోట్ల వేదాలు
కొన్నికోట్ల శాస్త్రాలు
అనంతమయ విజ్ఞాన శబ్దకోశాలు
ఎన్నో మరెన్నెన్నో
వానిలో నేనొకడను నీవొకడవు-
ముద్దుగుమ్మ అలా నన్నొక్కమారు చూచింది
నేను నా కాలిక్రింది దుమ్ము గగనానికి
అంటుకున్నాము—క్రిందపడినాను
మూర్ఛిల్లినాను ఆ మైకములో ఏదోయొక
రాగము—రాగములో తను మనోభ్రమణమొంది
నన్నేమిజేసెనో నాకే తెలియదు-

దానిలోనే కలదోయి
విమర్శన చేయవలసినది
నా ఇంద్రియ నిగ్రహత-
ఇంద్రియ నిగ్రహత్వము
లోకాని కుపకరించదు
ఐనా ప్రయత్నము జేసి
కొంతైనా యీ లోకానికి
చెప్పాలనిపించి ఈ పిచ్చిపాట వ్రాస్తున్నాను
దీనిని నీవేమైనా అను
దానికి "సందేశ"ము చెల్లును
తుదకు మహాకవి విమర్శించవలసినది
జీవరాసులనే, దానిలోనే కవి యనుభూతికి
తాత్పర్యము తత్వ సందర్శనము చేకూరుతుంది.
"తెలిసినవారు కోటికిని తేలరు ఒక్కరు మానవాబ్ధిలో
తెలిసినవాడు భూమిగన తిన్నగజారును మన్మథాకృతిన్"
కనుక నేను మహాకవిని నా ఆత్మకు తెల్పరాక
మీతో నేను తెలియనివాడననుట ఉచితముగదా!
నేను తెలిసితెలియనివాడనై యీ లోకానికి
ఒక నూత్న సందేశాన్ని యిస్తాను
అది యేంటో తెలుసా దాశరథీ !
కవిత్వమంటే ఏంటో, పండితులనదగిన వారెవరో !
ఇది మిగిలిపోయినది.

ప్రతివాడు నేను కవిని, నేను పండితుడ నని అరుస్తున్నారు. వారికి నాకు వాదము కావలెనని కాదు. ఎందుకలా అరుస్తారని "నా గొడవ". నేను చిన్న అణువును. అణువాకృతి ఒక మహా "సాగర" మేఘమై లోకాన్ని ముంచుతానుసుమా ! ఎందుకంటే నేను మహాకవినిగనుక.

నీకు భయమేస్తుందా! దాశరథీ! భయపడకు. నాకు నీమము నీతి శాసించియేయున్నది. నేను మిమ్ముల ముంచలేను. నాకు భాషవస్తే మిమ్మల్ని ముంచుతానని అనుకొందును. అప్పుడైనా ముంచివేయాలని నా భావన లేదు. యేదో ఒకమాట మీతో పిచ్చిగా అనేస్తున్నాను. కాని నేను సైంటిస్టులకు ఒక మనవి జేయదలచాను.

నాకు నలుగురు యోధులు గావలె
వారికి నేనొకమాట చెపుతాను

ఏమంటే! అదియిది: ఒక సైంటిస్టు భూపరిశోధన. ఒక సైంటిస్టు సస్యజాతికిజెందిన వృక్షరాజ పరిశోధన. ఒక సైంటిస్టు ముద్దు గుమ్మ చూపును, జీవరాసులను పరిశోధించుట. ఒక సైంటిస్టు మేఘాన్ని పరిశోధించుట. ఈ నాల్గు విషయాలను తెల్చుకొన్ననాడు ఈ లోకములో చూచేది అంతా వానిలో ఉన్నవని చెపుతారు. ఇది నాకు తోచిన పరమ సత్యానుభూతి. మీరు నమ్మండి నమ్మకపొండి. ఇంకెన్నియున్నవో మన పిల్ల తరాలు ఎన్ని చూస్తారో తెలియదు దాశరథీ! తెలియదు.

నేనొక కావ్యము వ్రాస్తున్నాను. అది యిప్పటంతలో తీసేదికాదు. దానికి పేరు " సనాధ ". నా 'సనాధ'ను ప్రస్తుత లోకాలను ఒక విజ్ఞాన మంటపముగా వర్ధిల్లజేయునని నా అంతర్వాణి చెప్పుచున్నది. యేమైనా కానిగాని కూడులేక కొంతమంది చస్తున్నారు. మరికొందరు పెంటల మీద తిండిని పారవేస్తున్నారు. ఈలా అన్యాయము జరుగుతుంటే వూరుకుంటావెందుకయ్యా! ఆ పెంటపైని వేసే అన్నం, ఇండ్లల్లో దాచిన ధాన్యం ధనం ఆ చచ్చే పేదలదికాదా! మీరు అలానే కండ్లు మూసుకుని కూర్చుంటే యింకా అన్యాయం చేస్తారు పేదలకు. మీ ప్రయత్నముతో గట్టిగా ఒక్కమాటైనా అన్యాయం జేసేవారికి చెప్పరాదా - యిది అన్యాయం అని. ఏమన్నా అంటే మీకు నేను తోడు

ఉంటాను- తోకెంబడి పెరుమాండ్లవలె. ఏమన్న బుద్ధి తెచ్చుకుని వినిరా సరేసరి. లేదా! కవిత్వము జెప్పుతాము. ఆకటికై చచ్చిన మానవ లోకానికి ప్రాణాలు యిత్తాము. ఒక్కమారు అందరు పెల్లుబికి లేచిరా, ఈ కుతంత్రుల మోసాలు, ఈ అర్ధరహిత పండితుల అధర్మబోధలు, శాంతి వాక్కులు ఏమౌతాయో అటుతరువాత వారికే తెలుస్తుంది. మనము కవిత్వముగ్రాస్తే చదువురాని పేదలకు ఎలా తెలుస్తుందంటారు మీరు. చదువేం చదువయ్యా! వారికి మాటలు వస్తాయికదా! దానిలోనె వాళ్లను వాళ్ళపైకి వుసిగొల్పే భావగేయాలు వ్రాద్దాము. ప్రాణాలు వచ్చి, చచ్చి నోళ్లు లేచి తోకతొక్కిన పాములట్లు, ఆకలిగొన్న పులులట్లు ఒక్కొక్కరిపై పడి కండలు లాగుతుంటే తెలియవస్తుంది వారి యన్యాయము. ఈ పని ముందు చేద్దాములేగాని నేను వ్రాసిన పరమ సత్యాలను పత్రికలు ఎందుకు అచ్చువేయలేదు? వాళ్లు భాగ్యమునకై భాగ్యవంతుల తొత్తులైనారు, పండితుల బానిసలైనారు, శబ్దాలంకారాలు ఛందస్సులు శాస్త్రాలు చూస్తున్నారు. శాంతి గీతికలు ముద్రిస్తున్నారని అంటారేమో మీరు, అయితే పుస్తకాలు వ్రాసి ప్రజలకిత్తుమా! మనవద్ద డబ్బులేదాయె. పబ్లిషర్లంతా డబ్బున్నవాళ్లేగాని సాహసిస్తే వారి కీర్తి చిరస్మరణీయంగా ఉంటుందిగదా! అయితే ఈ కావ్యానికి ఎందుకు పూనుకోవద్దంటావు. నీవు వ్రాస్తేనా ముందు? వారు పూనుకునేది అనియా మీ జబాబు. ఔను. సత్యమే. నేను వ్రాస్తాను పేదల కర్థమయ్యేటట్లుగా నాకొచ్చే భాషలో. భాష తెలియనివారికి అర్థమయ్యే కవిత్వము నాకు ప్రసాదించు దాశరథీ! దానిని వచ్చినవారు ఎలాగైనా తెలుసుకుంటారు. ఇంతకు ఈ సాహితీ ప్రపంచానికి నాథుడెవడు? విశ్వనాథు డనేకదా మీ భావము. ఔను.

ఇక నా కలము ఝళిపిస్తాను. లోకాన్ని మారుస్తాను.
నమస్తే! దాశరథీ నమస్తే!

---

# ౧

## "నిత్యమ్ సన్నిహితో మృత్యుః-కర్తవ్యో ధర్మ సంగ్రహః"

"ప్రపంచములో పుట్టిన వారెల్లరు చచ్చేవారే కనుక, "కర్తవ్యో ధర్మసంగ్రహః." మానవుడు ధర్మ సంగ్రహుడు కావలయును. ఏతద్ధర్మ కర్తవ్యమును తెలిసి వర్తించువారే జ్ఞానులు.

జ్ఞానులు ఎవరు? చదువుకున్నవారా! లేక ధనము సంపాదించువారా! కాక సుఖముల ననుభవించువారా! యని యాలోచించగ వీరిలో ఎవ్వరును కారనిపించుచున్నది. అటులైన మరి జ్ఞానులెవరు? అనగా! క్రూరులయందు, సాధువులయందు సమానస్థితి యొనర్చి మెల్గువాడే జ్ఞానియని బోధపడుతుంది.

సమానస్థితి స్వరూప మేమిటి ? యని యాలోచిస్తే భౌతిక దేహము ఉండి యుండనిదై పోతుంది. పాడు మురుగు కాలువయందు సంచరించినా, లేక మంచి మల్లెలతో గూడిన పూలతోటలలో నివసించినా యీ రెంటి వాసనలను జీర్ణించుకొనే మతి గలవాడై మెల్గుటయే జ్ఞానాంశ మని ఏర్పడుతుంది. అదెట్లు? ఒక మామిడిపండో లేక యేపండో పండిన సమయాన మంచి మధువాసన ఉండును. అది మురిగి పోయిన పక్షమున చెడువాసన ఏర్పడును. మంచిగా ఉన్న పండును తిని జీర్ణించుకుందు మేలాగో. మురిగిన పండునుగూడ అదే రీతిగ తిని జీర్ణించుకొనవలయును. అట్టి శక్తి ఎవనిలో యేర్పడుతుందో వాడే సంపూర్ణ జ్ఞాని.

సంపూర్ణ జ్ఞానికి యీ వాసనలు రెండును ఏర్పడకూడదు.

భౌతిక కాయము ఉండి, వాసనలు నశించినప్పుడే జ్ఞాని ఔతాడు. కనుక జ్ఞానికి యీ చెడు, మంచి యొక్క తత్వము నశించి పోయి నప్పుడే మంచి చెడులపై సమాన దృష్టి ఏర్పడును.

అప్పుడే సర్వసముడవుతాడు. వానికి విరోధులు లేరు. అక్కడే సర్వేశ్వర తత్వము ఏర్పడుతుంది, అని తెలియవచ్చుచున్నది. ఇది విపరీత వాదాంశమని మనకొక ప్రశ్న రావచ్చు. అది సహజము గూడాను. మానవుడు విపరీత జ్ఞానియౌట మూలమున, తన ఆత్మబుద్ధి పరితాప విమర్శనా మథనముతో ప్రకృతిలోని రహస్యానుభూతి యౌతు న్నాడు. కనుక అట్టి అనుభూతులను బాహ్య శక్తులను కేంద్రీకరింపజేసి తెలియజెప్ప ప్రయత్నిస్తాడు. అట్టి ప్రయత్నమును బాహ్యాశక్తులు రాగ క్రోధ ద్వేషాదులకు హేతువైన మార్గమున చరింపనీయక బలము కలిగిన మదపుటేనుగు మదమత్తుచే నిద్రించినట్లు జ్ఞాన మధువు స్వీకరించిన బాహ్యాశక్తులు అటు యిటు పరుగెత్తజాలవు.

అందులకే పుస్తకాలు, పూజలు, వ్రతాలు, జపాలు మొదలగు సన్మార్గములు అవలంబించ వలయును. మానవుడు— బాహ్యము, మన దేహము, జ్ఞానము, అంతరము. అంతర్గతమై యున్న జ్ఞానసంపత్తును మనోబుద్ధి బలములచే బాహ్యమునకు యీడ్చుటయే జీవిత పరమావధి· యేతత్సాధనమే జ్ఞానమునకు నాంది.

అందులకు మొదటిది హృదయ పరితాపము. మనసు నిలకడ, బుద్ధి విమర్శనము చేస్తూ ఉండవలయును.

## బుద్ధిః కర్మానుసారిణి

బుద్ధి జ్ఞాన జనితమైనదిగా గుర్తించవలెను. అట్లు లేకున్నచో దానికి విమర్శనయే లేకపోవును. విషమును విషముగానే, పాలను పాలనుగానే గుర్తించును. కనుక జ్ఞాన జనితమైన యీ బుద్ధి అపురూప స్వరూపమైన నిరాకారమని తెలుస్తూ ఉన్నది.

ఇట్టి బుద్ధి కర్మమునకు మార్గదర్శకత్వము వహిస్తున్నదిగా తెలుసుకొన వలసియుంది. మనస్సు గాలిబిడ్డ. ఇది ప్రపంచమంతయు కన్నుమూసి తెరచులోపల చుట్టివచ్చు శక్తి గలదిగా ఎరిగియుండ వలయు. అక్కడక్కడ తన బలము ప్రకారం చిక్కిన పదార్థముల తెచ్చుకొనుటకు పరుగెత్తి వచ్చుచుండును. దీనిని విడనాడకుండా బుద్ధి యధికారి వెన్నంటి యున్నాడు. ఏయ్ అది నిప్పుగుండము. తాకినచో కాలిపోవుదుము అని భయపెట్టించును. కనుక యీ బుద్ధి భూమి తత్వ ముతో గూడిన శరీరం బిడ్డయని తెలియుచున్నది. యీ శరీరము పాలు ద్రాగుటకు, పరుపున పండుటకు సంతోషించును. కాని నిప్పులో దూకు టకు వెనుకంజ వేయును. కనుక శరీరముతో గూడిన బుద్ధికి, జ్ఞానము (భర్త యైనాడు) తండ్రి యైనాడు. తండ్రికి యెవరితో సంబంధము లేదు. సుఖము లేదు, దుఃఖము లేదు. అతనిని ఆశ్రయించిన యీ బుద్ధి మనసువెంట మరియొక అగ్నిగుండము చేరుకొనునదిగా నూహిద్దాము. ఆ అగ్నిగుండములో బంగారు ముద్ద యున్నది. దానిని తీసుకొన వలయునని మనస్సు పరుగెత్తుతుంది. ఈ బుద్ధి రెండు విధాల ఆలో చిస్తున్నది. ఈ గుండములో దూకకపోయిన పక్షమున నాకు యీ బంగారు ముద్ద లభింపదు. లభింపకపోయినచో యీ దేహమునకు నగలు లేవు—

మరేమి చేయాలె ?

ఇది హృదయము మీద భారమైన ప్రశ్న. హృదయము కరుణ సంకలితమైన, జలము యొక్క బిడ్డ. యీ జల కలితమైన హృదయము యీ బుద్ధి మనస్సుయొక్క విషయ సంశయ పోరాటపు ప్రళయాగ్నిలో ఆవిరియై మేధకు జేరుతుంది. మేధస్సు, ఆకాశ తత్వము గలది అని తెలుస్తుంది. అక్కడికి యీ పోయిన ఆవిరిమయ హృదయ రాయ

బారము మేధస్సు అనే ఆకాశ మార్గమున ఏదో గ్రహించి తిరిగి నేలకు రాలుతున్నది. ఈ నేల ఎవరు ? బుద్ధిమయ భూతము. బుద్ధి నేలకు సన్నిహితురాలు. దానిలోనె ధర్మాధృతమైన కర్మ ఉత్పన్నమైనదని తోచుచున్నది. కనుక తిరిగి బుద్ధికి సందేశమును కొనితెచ్చినది. ఏమిటది ? జ్ఞానము.

నీవాసౌమ్ముల మీది కాంక్షచే ఆ అగ్నిగుండములో దూకిన పక్షమున కాలిపోతావు. అప్పుడు నీవు జ్ఞానదేవునకు దూరమౌతావు, అని చెప్పిన వెంటనే, బుద్ధి వద్దంటుంది. మనస్సు మరియొక దానిని వెదక పోవుచున్నది. జ్ఞానము నీ ఆలోచనకు దోహదమౌతున్నది. అపుడు నీ కర్తవ్య విధిని ఏదో నిర్ణయించుకొనుమంటున్నది. కర్తవ్య విధిలో చూస్తే తుదకు మానవుడు చూడదగిన దేదియును లేదు. చేరిపోరాని సూక్ష్మ సౌందర్యము జ్ఞానము, చూడలేని ఆనందము దేహము, ప్రపంచముగా తోచుచున్నది. ఈ ప్రపంచములో ఆవిర్భవించిన మానవుడు పరమాణువు, పరమాత్ముడు.—— పరాత్పరశక్తి చలనోద్వేగము. బహురూప విలాస యోగ్యమై అనంతావతారములు మారుస్తున్నది. నాకు చావు గలదనుటలో మానవులైన జీవాత్ములు తలంచరానిదిగా తమకు ముందు తల్లి, తండ్రి, జ్ఞానము గోచరించి తానుగా నేర్పడుచున్నాడు. తానుగా నేర్పడిన ఈ మహత్తరమగు జీవదేహము, మరికొన్ని జీవ దేహములు గలదై ఈ శరీరమును మారుస్తున్నాడు. ఆ శరీరములు మరిన్నిగా మారుతూ అనంతావతారమై పరమాత్మ శక్తి నాశనము లేనిదిగా, తుదిలేనిదిగా తోచుచున్నది. యిది ప్రపంచము. ఈ ప్రపంచము చూచుటకు నా కన్నులు సరిపోవు. బుద్ధి మనోయోగ్య రూపములైన ఆలోచనము, పరాశక్తి రూప సౌందర్యమును చూచి లీనమైపోవడము లేదు. ఈ ఆది అంత్య మహిమము, తోచుటకుగాని, చూచుటకుగాని

శ క్తి చాలని, ఆశాలతలు, ఆనందము, అనుభూతి మిగిలిపోయి ఈ లోకమున బ్రతుకుతున్నాము.

నాజీవము అనంత శరీరములపై సవారి జేయుచున్నది. నాభావము, అనంత శబ్దములపై సవారి జేయుచున్నది. కాని నా అనుభూతికి మాత్రము, యింకెన్ని శబ్దములు గలవో, యింకెన్ని దేహములు గలవో అని చెప్పరానివిగా, నాకు నేనే అహాహా యని హో హో హో యని ఆనందపడుతున్నాను.

నేను చావను
నేను జీవిని
నేను గలిగిన గలుగు దేహమ్
ఈ అనంత మహాస్వరూపమ్
జీవరూపమ్
దేహమౌనోయి
జీవదేహములైన భావము
శబ్దమయమై పోవుచున్నది.
ఈ సవారిని అడ్డలేరోయ్
ఈ సవారిని అడ్డలేరోయ్

---

## ప్ర బో ధ ము

ఒకరు నొకరిని మ్రింగివేసే
రాక్షసత్వం మారిపోవలె!
ఒకరినొక రిల దోచివేసే
దారుణత్వం సమసిపోవలె–
అందరును సమజీవులై భువి
అందుకోవలె భావవేదమ్
భావవేదమ్ చదువువారికి
అమ్మ ముందుకు వచ్చినిలుచును–
అడుగు సందేహముల దీర్చును
తగిన బలమును ఇచ్చిపంపును–
పుట్టినట్టీ కవులు సైతమ్
జీవసమతను చాటిచెప్పుదు
అందరకు ఉండాలి కూడు
అందరకు ఉండాలి గూడు
అందరకు ఉండాలి గుడ్డ
అందరకు ఉండాలి విద్దె
నా కవిత్వములోని సారము
ఎంత దీసిన యింతెనోయి—

## ని ట్టూ ర్పు

నిరుపేదల ఆకలిమంటల్లో
పరిగెత్తే జలపాతాశ్రులు
ప్రపంచమునె ముంచేస్తాయోయి
పరిభ్రమణ కలిగిస్తాయోయి–.

జీర్ణించిన కవిహృదయములో
వల్లించే కావ్యాలెన్నో
కదలిస్తే ప్రపంచమంతా
త్రేతాగ్నుల గురిపిస్తుందోయి—
రుద్రవీణా నాదామృతము
చిచ్చుకంటితో ద్రాగాలోయి
త్రాగే సత్తువ లేకుంటే మరి
చావండోయి హాయిగ మీరు—
ఆకాశపు టంచులదాకా
ధ్వనియించే నా శబ్దాలు
మీ చెవులో గియ్యాని మ్రోయ
వినలేరోయి మహాకావ్యము
వినలేరోయి మహాకావ్యము
అందుకొరకే నేను మహాకావ్యము వ్రాయను—

## పోవాలోయ్....రావాలోయ్

కులమత భేదమ్
కలుషిత వాదమ్
కుటిల ప్రయత్నం
నటన కుతంత్రమ్
పోవాలోయ్,పోవాలోయ్
సమతా రూపమ్
సుమహిత వాదమ్
జీవనసారం
భావన వేదం
రావాలోయ్, రావాలోయ్

# మాతృత్వము

నా చదువుయొక్క అనుభవము. విచారము....నా విచారము మాతృత్వము. మాతృత్వము మహిమాన్వితమైనది. చెప్పరానిది, నుడువ లేనిది. భావస్వరూపము తల్లిలో గలదు. తనువు తనువులో గలదు. తల్లి, ఈ తనువు. ఆ తల్లి సేవకై వచ్చినది. తల్లి భాషలో ప్రార్థిస్తాను. తల్లిని పూజింపని జన్మమేల, అది పోనేల, రానేల. ఆతల్లి అవసరము లెన్ని యేని తీర్చగలదు. తల్లి భాషను చంపువాడు ప్రపంచములో పుట్టడు. పుట్టినా గిట్టును. తల్లిని మరచు తనువు నాశనమౌతుంది. తల్లిని గొలి చిన తనువు తాదాత్మ్య మొందుతుంది. నా విజ్ఞానమంతయు తల్లి సేవకై అర్పింతును. అపుడు నా కన్నమ్మ కడుపు ధన్యమౌతుంది.

"కలుగనేటికి తల్లుల కడుపు చేటు" అని ఇందుకే అనెనేమో? పోతన భక్తుడు. అట్లుగాని జన్మ, తల్లి గొడ్డుతనాన్ని సృష్టించును. నాతల్లి బాసను, నా మాతృదేశమును, పూజింతును. దానికై నేను జన్మ లెత్తెదను. అవసరము అంతు దేల్చదు. అంతు దేల్చనిది అగాధము. అగాధము నాకవసరము లేదు.

1. అపురూపములకు చలనశక్తియుతమైన ఆత్మమూలము.
2. మూలము మాతృత్వము—తల్లి.
3. శబ్దము చలనరూపము.
4. శబ్దము ఆత్మజనితము.
5. ఆత్మజ్ఞానము విజ్ఞానము.

విజ్ఞాన యుగము రావాలంటె ఆత్మజ్ఞానము కలగాలి. దానివలన శబ్దము ఏర్పడుతుంది. శబ్దరూపము లనంతములు.

ఆత్మ ఒకటి— ఆత్మాలోచనే విజ్ఞాన శాస్త్రము. విజ్ఞానము శబ్ద రహితమైనది. ఆలోచనాత్మకమైనది. ఆలోచనానంతరము శబ్దము వచ్చును. కనుక భాషలకన్న భావప్రధానమే మాతృత్వము, విజ్ఞానము.

మొదలు నాకు కావలె భావము—మాతృభాష. తరువాతవి భాషలు. మాట్లాడుటకు ముందు ఆలోచన అంతుతేల్చవలె. ఆ అంతు గర్భ స్థానమైన గిలిగింత శబ్దరూపమై పైకి పెల్లుబికి వచ్చును. దానినే నేను చెపుతాను.

కూడు గూడు గుడ్డలేని
బీడుబడిన బ్రతుకులెన్నో
వీధులంబడి విద్దెలేకా
బాధలంబడి బ్రతుకులీడ్చే
కుంటి గ్రుడ్డి గూని అనాథ పేదల
చావకుండా చూడవలెనోయి
చావకుండా చూడవలెనోయి.



# మహాప్రపంచం

శా. శ్రీవాణీ పదపద్మ సంస్తుతమఁన్ జెన్నొంద కావ్యేందిరా
దేవిన్ గొల్తును సర్వకాలము కృపా దీప్తుల్ ప్రసారింప నా
భావావేదన గీతమాలికలతో భక్త్యంజలుల్ సల్పుదున్
దేవా ! సత్వరతన్ మదీయ కవితాదీప్తుల్ దిశల్ బర్వగన్.

తే. ఆదిమధ్యాంతరహితు విశ్వాత్ము దలతు
గ్రంథ రచనమ్ము నిర్విఘ్నగతులసాగ
సుజన హృత్పద్మములును సంశోభిలంగ
నీ మహాకావ్యమును రచియింపనెంతు.

క. శ్రీ కారుణ్యా యశోధర !
లోకాధిప! విశ్వరూప! లోన భజింతుఙ
నా కాధారము నీవని
ఈ కావ్యము వ్రాయనెంచి తీప్సితమెసగన్.

క. శ్రీకర భవ్యగుణాకర !
ప్రాకట సద్భక్తలోక పావనమూర్తీ !
నీ కరుణార్థిని తండ్రీ !
సాకుము సంపదల నొసగి సద్గుణధుర్యా !

ఉ. ముక్తికి మూలమై తనరు మూర్తిని గొల్వక మానవుండు స
ద్భక్తిగడించునే యవని ధార్మికమార్గము వీడి లోన సం
రక్తి గలుంగ చిత్తమలరార పరాత్పరు దల్చి ప్రార్థనా
సక్తుడు గాకటంచు మది సన్నుతిజేయ నుపక్రమించితిన్.

మ. వినరండో జనులార! సర్వజన సంవేద్యంబుగానొప్పు భా
వన తార్కాణము గద్యపద్యములతో, పాపిష్టి లోకంబునన్
కనరండో జనులార! సుంత కరుణన్, కాఠిన్యమున్ బాసి దు
ర్జనమాన్య ప్రభుతన్ యథార్థకథనాచాతుర్యయత్నాకృతుల్.

తే. అతుల భాగ్యయశోరాశి కాలవాల
మై మహిని కీర్తిగాంచిన యట్టి పల్లె
సీమ, శ్రీపురాహ్వయమయి చెలగుదాన
దనరు ఫల పుష్పకోద్యానతతి సతంబు.

ఉ. కమ్మని పాలమీగడల కాగులు నిండ్లసెలంగు ధాన్య వి
త్తమ్ములు రాసులై వదిగి తాండవమాడు పొలాలబండు ము
త్తెమ్ములు, బోటులెల్ల యువతీమణులై మురిపించు తేంట్లు రా
గమ్ముల, వాకిళుల్ పొలుచుగాదె నిజమ్ముగ స్వర్గలోకమై.

క. భవనమ్ములు వినువీథుల
కవగూడు ననంగ వెలసి కమనీయ సుధా
ర్ణవ నవవిలాస పంక్తుల
భువి సెలగె మహోన్నతముగ ప్రోద్ధతినొప్పన్.

క. ఝుమ్మను మధుపమ్ములు బహు
కమ్మని తేనియల గూర్పగా పూదోటన్
కొమ్మలు రాల్చుచు ద్రావెద
రమ్మమ్మిది యెంత మధురమమ్మా యనుచున్.

చా. అనుపమ వీథి వీథుల ఒయారముగా బహు కెక్కిరింతలన్
వనితలు ప్రేమరాగముల పాడుచు నాడుచు నంతకంత తి
య్యని ఉపమాన సామెతల నందముతో సుకుమార మారు మో
హినులయి నాథులం గలతురిండ్ల సుభాషిణులై రతేచ్ఛలై.

క. ఒకపరి చకచక నడలను
ఒకపరి త్రిప్పటల మేలు నొక్కొకపరి జం
కక గకవికలను నాథుల
కకలంక సుఖంబులిత్తు రతివలు పల్లెన్.

ఉ. ప్రొద్దునె లేచి బాలికలు పూలవనమ్ములకేగి మల్లియల్
ముద్దులు గుల్క దెచ్చుకొని మోదముతో జడలల్లి వేళకున్
చద్దుల నారగించి కడు చల్లదనంబున పాఠశాలలన్
విద్దెల నేర్వబోవుదురు విన్నదనంబు మదిం గనుంగొనన్.

క. ఆటల పాటల బాలురు
దీటుగ వడియాడి పాడి దివ్యముగను బా
హాటముగ పాఠముల వే
నోట పఠింతురు ఘనముగ న్యూనతలేకన్.

తే. అప్పురమ్మున వసియించు యతివలంత
కులమతంబను భావచింతలను వీడి
అమల భావోదయముల నప్యాయముగను
కూడియుందురు చెంగనా లాడుకొంచు.

వ. మరియు నాపల్లెలో

చ. అరయగ నాల్గువేదముల నద్భుతలీల పఠింపగల్గినా
రురుతర భక్తి పాండితిని యుత్తమలీల సగర్వమెంచ స
త్వరత కథార్థముల్ కవిత వ్రాయగనెంతురు సత్యశీలురై
వరలుదు రార్యవర్తనుల వైష్ణవభక్తి వహించి మానవుల్.

క. ఆ పురమనుజులు చక్కని
కాపురముల మించి వేడ్క గమితో మేడల్

గోపురములంత గట్టిరి
యేపుమిగుల దానములను యెసగుచు కీర్తిన్.

క. కాపులు పంటలదీయుచు
మేపుదురా యూరి జనుల మేపకయున్నన్
కోపము తాపము వచ్చును
కాపురముల నిల్పు రాజు కాపు ఘనుడనన్.

క. కరణము దొరవారికి యను
సరణముగా నుండి బ్రతుకు జారుని లీలన్
కరణము దొర కాభరణము
మరణం బాయూరిజనుల మాన్యుండనగన్.

క. కొరకొరమను కావలి కను
ఉరుముల కాయూరివార లురుకరు అహహా !
కరణము బంపిన దూతా !
శరణము మా పాలి జముడ ! శనిగాడనగ౯.

ఉ. శిల్పకులాగ్రగణ్యులట చిక్కని కీర్తి గడించి యెంతయో
స్వల్పులమాడ్కి మెల్గుదురు సామరసాన్వితులై ప్రశాంత సం
కల్పులుగా సమస్తగుణకారణ ముక్తిపథానువర్తులై
సల్పగనెంత్రు ధర్మముల సాహసులై జనులెల్ల మెచ్చగ౯.

వ. ఇట్లుండ నొక్క మధుమాసంబున

చ. సలిల సమీరజాలములు చయ్యనవీవగ నంత మావి గు
మ్మలు విరజాజి పొన్నలు సుమమ్ములనిండె మనోహరమ్ముగా
సులలిత భామినీలతలు శోభితవర్ణ తుషార దీధితుల్
వెలసె గులాబి మల్లియలు వెన్నెలమాడ్కిని పూచి హాయిగ౯.

వ. అదియునుంగాక నా యూర భీమాచార్యుం డనువాడు

తే. భక్తగుణశీలు డార్యప్రవర్తనుండు
వైష్ణవుడు సప్తసంతాన ప్రాప్తివడసి
సకల జనముల సంతృప్తి సలిపి దాన
ధర్మములజేసి పేరొందె ధరణియందు.

చ. అమలగుణ ప్రభావ సముదంచితకీర్తి విశాలభాశితో
త్తముడు సుశీలు డార్యజనతత్పరు డగ్రకులాత్ము డార్ద్రచి
త్తమతి యభిజ్ఞుడైవెలుగు ధన్యతముం డఖిలార్థరక్ష సం
భ్రమ మవధాన్యుదోర్వి విపులార్థ కృతార్థమతిన్ రహించెడున్.

క. భీమాచార్యు కుమారుని
రామాచార్యుం డటంచు రహిమీర జనుల్
వేమారు బల్కనెంతురు
గ్రామంబున వీనిమించు ఘను డిలగలడే !

క. కొమ్ములు దిరిగిన పండితు
లిమ్మహి రాముం జయింప నేరికి దగు శా
స్త్రమ్మున బ్రహ్మయునైనను
గమ్ముగ నోర్దెరువకుండుగాదె నతనితో.

సీ. అతని పాండితిదెల్య వ్యాసుడే మరల జ
న్మించి పెంపుగను వాదించవలయు
అతని నైష్ఠికశక్తి నరయ విశ్వామిత్రు
డవతారమెత్తి యీభువి మనవలె
అతని యుద్ధృతనీతి కవని బేర్కొన విప్ర
నారాయణుడె వాని నయతగాంచు
అతని పరస్త్రీ వితతి విముఖతగాంచ
ఋష్యశృంగుడె వాని శిష్యుడగును

గీ. పరమ కల్యాణి భారతావని మహాత్ము
లెందరో పుట్టి పెరిగిరి కందువోక
అట్టి వారిని మరపించు దిట్ట వీడె
'యనగ భువి నెగడెగాదె ? యాశ్చర్యమొదవ.

సీ. అల జయంతుడు కంతు డవని వీనిం గెల్వ
చక్కదనములమించు చుక్కయితడె
అల హరిశ్చంద్ర ధర్మాత్ముని మరపించు
సత్యసంధాన సంసక్తుడితడె
అల దానకర్ణుని యధిగమించిన గొప్ప
దాత యనంబరగు ధన్యుడితడె
అల ధనంజయుసాటి అలమందున గెల్పు
గాంచు విక్రముడన మించు నితడె

గీ. ఇతని బోలిన మరియొక యింద్రు నరయ
లేడు కవి బ్రహ్మయన వీనితోడు భువిని
అర్థిజన కల్పశాఖి పుణ్యాత్ముడనగ
మించు ధనికుడు జగతి లేడంచు బల్క.

సీ. మించువిండ్ల దిరస్కరించు కనుబొమ లరయ
కమలమ్ములకు దీటు కన్నులుండి
ఘన కవాటంబట్లు దనరు వక్షం బరయ
సోమునిగేరు ఎలమోముతోడ
వేదండ శుండాభ దోర్దండ మండిత
సింహ విక్రమము సుస్థిరత మెరయ
అపరంజి రంజితాత్యద్భుత ధృతకాంతి
నిరసించు తనువుపై మెరయు హొయల

గీ. ఘుంఘుమార్భటి నిరవొందు కుసుమమట్లు
తలను వీచెడు పువ్వులతైల మహహా !
అపరమన్మథు డిబ్భువి యవతరించె
ననగ శోభిల్లెగాదె? యీ ఘనుడు నిరతి.

వ. ఇట్లుండ నొక్కనాడు రామాచార్యుడు వేసవికాలమగుటం జేసి ఊరివెలుపలి పూదోటకు వాహ్యాళికేగెను. అయ్యది వసంతకాల మగుటచే ప్రకృతి నందనవనముగా వికసించి యతని హృదయమును నాకర్షింప జేసెను. తానొక చక్కని కవియునైయున్న కారణమున ఒక చక్కని పూలచెట్టుక్రింద అల్లనల్లన వీచు పిల్లగాడ్పులకు విశ్రాంతి గొనుచు తానిట్లు రాగాలాపన జేయుచున్నాడు.

ఉ. ఆమని యేగుదెంచె కుసుమాంగన చిర్నగవుల్ హసించె భా
మామణి పాలబుగ్గల ఘుమంఘుమ వాసన లుప్పతిల్లగా
భూమి చిగిర్చె కామినుల పోలిక యందము చింద వేపపూ
లేమలు మావిగుమ్మలు పరీమళమారుత శోభగూర్పగన్.

ఉ. కోయిలగొంతులో కొసరి కూజితముల్ వినవచ్చె మంజు లా
ప్యాయ మనోజ్ఞ సుస్వర విపంచి నినాద వికస్వరార్భటుల్
లేయెద మోసులెత్త భళిరే మధుమాసము పాటబాడెనే
మో? యిక మానవాళిమది పొంగ కవుల్ కవితల్ రచింపగన్.

సీ. ముడిచెనేమో? కొప్పు మోదుగుభామ యిం
పులుగుల్క నెర్రపూవులను బూచి
కట్టెనేమో? సిగచుట్టు మల్లియ మొల్ల
పొన్న పొగడలుబూచి పొంగిపోవ
అల్లెనేమో? జడ యుల్ల ముప్పొంగ జా
జి విరజాజి గులాబి చెన్ను మెరయు
జుట్టెనేమో? తలకట్టునిండ యనంగ
చిన్నారి చేమంతి చెలువుమీర

గీ. వికచితోల్లాస నేత్ర సంవేద్య పరిమ
ళావృతంబొప్ప పూచానలతి మనోజ్ఞ
రూప లావణ్యములదేలి యేపు మిగుల
సంతతానంద సంభరితాంతలగుచు.

సీ. వింజామరములట్లు విరబూచి వేప పూ
కొమ్మ రెమ్మలవీచె కమ్మదనము
నిగనిగల్ నెగడ సంపెగరాణి తన కేల
పూలదండల బట్టి బూచెనేమొ?
పగడాల హారంపు పగిది గూర్చినదేమొ ?
పచ్చని చిగురుల బండి మఱ్ఱి
పూత నిండియు కొంత కాతబట్టిన మావి
క్రొత్తపచ్చడి విందు నిత్తుననియొ ?

గీ. పృథుల పల్లవ లికచ కోమల వసంత
రాణి రాక నెరింగి సంభ్రమముగోరి
వీచె వింజారము వేపకాచె మావి
పచ్చడకు నిచ్చె వే మఱ్ఱి పండ్లసరుల
చంపకము పూలహారాల కంపునింప
స్వాగతముబాడె ప్రకృతి సంపదలునిండి.

సీ. మధు రసంబులగ్రోలి మత్తభృంగ చయంబు
మధురగాన విలోల సుధలుజిమ్మ
శుకపికమ్ములు తమ రకరకమ్ముల స్వర
మ్ముల కంఠమెత్తి పాటలను బాడ
హరిణాళి చెంగనాలాడి యద్భుతలీల
నాట్యాభినయత విన్నాణ మెనయ
కోతిమూకలు గుమిగూడి పండుల మెక్కి
భటులుగా నెగసి నార్భటులుసేయ

గీ. మందహాస వికాస మానందమాన
మానసయునయ్యె ప్రకృతి పద్మాలయమున
కరుగుదెంచెను వాసంతి యాత్మపొంగి
ఆశ్రితులకెల్ల నాశీస్సులందజేయ.

వ. అట్టి సమయంబున

ఉ. వచ్చె నుగాది లోకమున వచ్చిన నూరకరాదు వేపపూ
పచ్చడ బంచిపెట్టి తన ప్రాభవమంతయు జాటి గొప్పగా
నచ్చెరువొంద జేయు జనులందర నంతట బోక ముద్దుగా
ముచ్చటలొల్కునట్టి నవమోహన రాగము నాలపించెడుఁ.

సీ. పరిరంభణమ్మొలక పసిమినిగ్గుల నింపు
మామిడియాకు గుమ్మముల వెలసె
మిసమిసల వొయ్యార మెసగ ముంగిట విటపి
చిగురుటాకుల శోభ చిందులాడె
ముకురమ్ములట్లు ఖియండ్లకు ముద్దులొల్క వె
ల్లని పట్టెసున్న ముల్లము చలింప
కళకళలాడ నంగన లిండ్ల సిగమల్లె
పూల ఘుంఘుమల దోబూచులాడ

గీ. పల్లెలం దిండ్లు ప్రకృతి సంపర్కమంది
పరిమళించె నుగాది పర్వంబు కలన
నూత్న చైతన్యయుగము మనోహరంబు
వశమె వర్ణింప జగతి నెవ్వారికైన.

తే. విపణి వీధుల నెల్లెడ విరగబడుచు
క్రొత్తవగునట్టి శనగలు గోధుమలును
కొనిరి బెల్లము చింతపండును యుగాది
పండుగనుగూర్చి జనులు సంబరముహెచ్చి.

సీ. ఒకపేద యీ యుగాదికి వెంజనములేక
నిల్లాలిసొమ్ము లంగళ్లజేర్చు
ఒకదొర యీ యుగాదికి సతీమణి మెచ్చి
క్రొత్త నగ నాణెముల్ గొను ముదమున
ఒక దరిద్రస్వామి ఉవిద చింపురుచీర
గటి బిడల చంకవెట్టుగాదె ?
ఒక ధనికుండు భార్యకు గట్టుకొన పట్టు
పీతాంబరముల గొన్పెట్టుగాదె ?

గీ. పండుగలవేల సౌభాగ్యవంతు లిండ్ల
భోగభాగ్యముల బొంద్రు సంపూర్ణముగను
ఘోర దారిద్ర్య వేదనాభారమెంచి
బీద లున్నంతలోన సమ్మోదమొంద్రు.

సీ. ఉదయ మమితోత్సాహ మొదవ సర్వజనాళి
యభ్యంజన స్నాన మాచరించి
మధ్యాహ్నమెంచి కమ్మని పచ్చడల్ గ్రోలి
దేపులు దీప్తింప దిని ముదమున
సాయంత్రి నూత్నవస్త్రముల ధారణజేసి
కదలిరి రచ్చ మారంబుబట్టి
రాత్రి నవపంచాంగ రాద్ధాంత బోధలై
పాతపంచాంగాల భద్రపరచి

గీ. పూజ లొనరించి విజ్ఞుల బుద్ధిమెచ్చి
కానుకలొసగి నవగ్రహ కాలగతులు
తమ తమ గ్రహచారముల్ తగనెరింగి
ఇల్లు జేరిరిగాదె ? సంఫుల్లమతుల.

వ. అయ్యది సంవత్సరాది దివసంబు గనుక ఉపరిపీధుల దిల కించి రామాచార్యుడు తనమనంబున

సీ. చీకటి వడిలోన జిక్కఁబట్టినదేమొ ?
నెలరాజు పదియారు కళల ్రమింగి
గగనతలమున మణుల్ గప్పినట్లు వచించు
తారకాంతలె వాని దాచిరేమొ ?
జిలిబిలి పలుకుల కలువమ్మ పిలిచెనో ?
చంద్రికాగృహమందు చలువదీరె
కలికి చకోరక మ్మలిగెనోయని రాజు
నింగి కని గననట్టు తొంగిచూచె

గీ. మారుతాహతి ప్రకృతి పద్మాలయమున
పూలు నవ్వెనో ? పరిమళంబులు సెలంగె
నింతి వలపులు పూచె చింతలనుబాసి
ఈ యుగాది ప్రవేశమై యింపు గులుక.

వ. రైతు రాజులంత •

ఉ. గొడ్డలి దుమ్ముగుంటుకలు "గుద్దలి" దాల్చి భుజంబునందు వే
దొడ్డ సిపాయివోలె వడిదూగుచు ముందుకు వీరులట్లుగా
దొడ్డ డవుల్ నశింప వడిదూర్చి పసందుగ భూమిజేసి తా
నెడ్డె విధమ్ము వేసమున నింగిని యాశలు నిల్పి చూచెరా !

శా. ఏవోయాశలు మోసులెత్త మదిలో నేమేమొ యోచించు స
ద్భావోపేతులు రైతురాజులు దయో క్ష్మచిత్త సంభూతులై
యావన్నీరద మావహించి బ్రతుకుల్ ఆత్మాభిమానంబుచే
చేవన్నొడపుచు నార్తి భూమిని యశోసిద్ధ ప్రభూతాత్ములై.

తే. ఆరుకాలాలు నిండెను వరుసమింత
పడ దదేమని బాధలం బ్రతుకు లీడ్చు
లోకపాలకుడగు రైతు లాకలి గొని
కాగిపోయిరి నిలువెల్ల రగిలి పోవ.

గే య ము

వరుసమ్ములేకున్న హర్షమ్ములెటుగల్గు
భూమిబండిననాడె భూమీశులకు బ్రతుకు
రైతు నాగలిపట్టి రక్తమోడ్చిన తిండి
రైతురాజ్యములేక రాణించునే భూమి
గడ్డి గాదము తీసి దొడ్డ యెడవులనెల్ల
పిండిజేసి రసమ్ముపిండురా పంటలుగ
రైతు జీవనదాత రైతుదేవుడె రాజు
రైతు బెంచిన పంట రహిమించె జగమంత
సకల వేదాంతమ్ము సకల శాస్త్రార్థమ్ము
సకల పాండిత్యమ్ము సకల కవితార్థమ్ము
ఆ పంటలోగాదె ? అవతరించెను హాయి
సర్వేశ్వరునివోలె యుర్వివెలసెను రైతు
ఓహెూ మహేశ్వరా !
ఓ నా పరాత్పరా !

వర్షమ్ముకై రైతు హర్షమ్ము వెలయింప
ఎటుదాగితివి దేవ ! ఎటుపోతివో దేవ !
బండలెల్లను బగుల ఎండలను గురిపించి
మండించు నీభూమి నిండజేయవె వాన
ఆహారములులేక హాహారవములంది

అణగిపోయిన రైతు ఆశలు చిగిర్చవా ?
తినుటకై గతిలేక తికమకలుబడి రైతు
మింటికై చూచుచున్నది కనుటలేవయ్యా
చీమనుండియు పెద్దదోమ రాజుల వరకు
జీవదాతగు రైతు జీవములు తల్లడిల్లె
ఎండ లెండుకపోయి యేసారె బ్రతుకెల్ల
మండు దివిటీయయ్యె మసలె యీ భూమెల్ల
ఘనుడవే నీవంట ఘనుడవో దేవా !
ఘనుడవై వర్షమ్ము గార్చుమో దేవా !
ఓహెూ మహేశ్వరా !
ఓ నా పరాత్పరా !

ఈ మహాపత్సమయ మందు నీ వగుపడక
అంబతోగూడి నీ వాడుకొనుచుంటివా !
అవసరమ్మునకు నక్కరరాని బంధువులు
పేద బాధల మొరల ప్రేమతో గననట్టి
పుణ్యాత్ము లీభువిఁ బుట్టనేమిటికి ?
పుట్టి గిట్టిననేమి పుణ్యంబు లోకాన
పుట్టి గిట్టదె చదలు పుట్టలో నరయ
అట్టి దౌర్భాగ్యులెందరు అవనిలేరు
వారి గూడినవాడు అవని ఈశ్వరుడా !
ఓహెూ మహేశ్వరా !
ఓ నా పరాత్పరా !

నినుగూర్చి ఘోషించు అనుపమ పురాణాలు
ఆర్తరక్షకుడు సకలార్థ సంపన్నుడని

భుజగ భూషణుడంచు భూనాథుడవటంచు
మెచ్చి మూడవకంట చిచ్చు నించితివంట
గంగ శిరసున భార్యగా నిలుపుకొంటివట
సిగను చంద్రుని పువ్వుజేసి తీర్చితివంట
విసము కుతుకననించి యెసగినావట వీవు

ఏది యా నీరూపు ఈశ్వరాకృతి జూతు
ఈశ్వరా! నీరూపమెంత యందమ్మొ?
అట్టి చిత్రము కనుల గట్టినటులుందు
అట్టి యందముతోడ నగుపడవ దెందు
పాపమెంచక పైని పాములే కరచి
ఏపుమీరగ అగ్ని కోపమున రగిలి
గంగాభవానితో గలసిపోయావా?
విసపుమంటలలోన మసియయ్యి పోతివో?
పుట్టి గిట్టుట నాకు భూమి గనవచ్చె
అట్టె నీవునుగూడ అవని బాసితివా!

అదుగొ! నింగిని చంద్రు డాడుచున్నాడు
చచ్చె,నీశ్వరుడంటు చాటుచున్నాడు
లేకపోయిన దివి నేకతన నిల్చు
అందుకే యిటు గంగ అవని వెలసినదో?
అందుకే అచటచట అగ్గివెలసినదో?
కాక వల్మీకాల కదులునా ఫణులూ?
విసము కొట్లల్లలో ఎసగి అమ్ముదురా?

ధరయంత నా కగాధముగయైదోచు
ఎవరి నీశ్వరుడంచు నే ప్రొద్దుదలతు

మేఘుడే దేవుడని మెదలెె నా హృదిని
మేఘమే లోకమై మెదిలె గాదోయి
రావోయి వో మేఘదేవా ! మ్ఘముజూచి
పోవోయి కరుణానుభావా !

మబ్బుల్లొ మసలుచును నిబ్బరంబుగనుందు
ఎవనబ్బ కిలవెరతు ? జవమంత వీవౌదు
భువి జనుల పాలింతు భువి రాజులేలింతు
అవని జీవులకెల్ల నాధారమైయుందు
దివి ఘనుల కీవెల్ల భవుడవై వెలుగొందు
తారకల మలగింతు గాలి గప్పున బీల్తు
జోలిమాలిన యిరుల పాలినే సుఖముందు
సూర్యుడే వెరచు నినుజూచినంతన దివిని
పారిపోవును యెటకొ శూరత్వమంతయును
ధరణి రైతుల మొరల కరుణించి వేవేగ
ధాత్రి వర్షములతో దనుపుదువు హర్షముల
ధరణి జీవుల మొరల కరగి నీ నిలువెల్ల
సలసలంగ్రాగి వే సంక్షోభ మెలయింతు
అగ్గిపిడుగులభూమి నలరింతు మిసమిసల
గర్జింతు లోకాల గాంగ్రడింతు వడినెగసి
తళతళల విద్యుత్తు తరలింతు భువనాల
మరపింతు దివనాల చూపింతు భువనాల
భువనాలు దివనాలు భోరుమన గర్జింతు
నాకాల మలగించి లోకాల సృష్టింతు
గుట్టలను పిండిగా గూల్తువే వొకవంక

చెట్టు చేమల నించి చెలగాడుదువు గాలి
నిన్నెవ్వడిల గెల్చు? నిన్నెవ్వడిల దల్చు?
అన్నిలోకాలకీ వధిపతివియైనావు
సుధలు నించెటిమేటి శూరుడవు నీవోయి!
అన్నిరసములకీవు ఆధారభూతుడవు
నిన్ను మరచిన చావు నిన్ను దలచిన మేలు
నిన్ను దలఫనివాడు మిన్నులే తిలకించు
నిన్నుదలచినవారు మన్నుపై విహరింత్రు
　రావోయి వో మేఘదేవా! మము జూచి
　పోవోయి కరుణానుభావా!

అందరిల ఊడ్చిపోసిన చెత్త చేదారు
అందరిల ఊడ్చి చల్లిన బూదికుప్పలను
ఉర్వి రైతులు దిబ్బజేసి యడవికిమోసి
ఎర్వనుచు భూమెల్ల బర్వినారయ్యా
　రావోయి ఓ మేఘదేవా! మము జూచి
　పోవోయి కరుణానుభావా!

వరగాలి తరగల్లు బురగాలి బుసబిసల
ఎర్వెల్ల పర్వెత్తి కొర్వికొండల నిల్చె
రైతు హృదయము రగిలి హాయి తోబా అయ్యింది
ఇంట బిల్లలు ఆకలయ్యేడ్చుచున్నారు
　రావోయి ఓమేఘదేవా! మము జూచి
　పోవోయి కరుణానుభావా!

నీరాకచే ధరణి నిలువెల్ల పులకించి
ధరణి జీవుల జీవధాత్రియై వెలుగొందు

జగమెల్ల సంతోషముగ సాగు నీరాక
పాడిపంటలు నిండి పారగా ధరయంత
రావోయి ఓ మేఘ దేవా! మము జూచి
పోవోయి కరుణానుభావా !

కర్వు మంటలలోన కాలిపోయెడి కడ్పు
నీ రాకకై నిలువు నిస్సారమయి ఏడ్చె
ఎల్ల దేవుల కాదితల్లిదండ్రివి నీవె
ఎల్ల బలగంబులకు అప్త బంధువు నీవె
భువి దివుల పాలించె భూపతివి నీవంచు
దివి రైతు లెల్లెడ ధీయంచు నుడివారు
రావోయి ఓ మేఘదేవా ! మము జూచి
పోవోయి కరుణానుభావా !

మందహాసము చిందు మరకతమ్ములమేడ
సుందరీమణి స్రుక్కి సోలి పోతున్నాది
ఎల్ల లోకములెల్ల ఏమి జేదామంచు
ఉల్లమందున దల్చి గొల్లు నేడ్చారోయి
ఏలికల మేమనెడు పాలకుల పాటెల
నీరాకచే గాదె ? ధరణి పరిపాలనము
నిట్టూర్పు సెగలెగసి నీలి పోతున్నారు
రైతురాజులు భువిని రాత్రింబవలు దల్చి.
రావోయి ఓ మేఘదేవా ! మము జూచి
పోవోయి కరుణానుభావా !

చిన్ని కాసారమ్ము చిన్న పోయిందోయి
మండు టెండల గ్రాగి మాడె మాచెరువమ్మ
త్రాగ నీళ్లేలేక బావు లెండుకపోయె
రైతు రాజుల యెడద రగిలిపోతుందోయి
రావోయి ఓ మేఘదేవా! మము జూచి
పోవోయి కరుణానుభావా!

వ. అప్పుడాకవి మేఘమునే దృషి నిడుకొని ఈశ్వరునిగూర్చి ఈలా అంటాడు

ఓహెూ మహేశ్వరా!
ఓ నా పరాత్పరా!
సకల జీవములకా సర్వేశుడే భుక్తి
ముక్తి గూర్చియు సతము పోషించు వాడంట
చచ్చినాడని భువికి చాటు దేరీతి
చచ్చి పోయినవాడు చావమే మనము ?
ఇల పురాణములె పిచ్చెత్తి ఇటు బల్కెనా!
కుమతులే కోపమున గూర్చిరా యిట్లు!
కనపడని వాన్నిపై కల్పించి దిట్టు
ఘనులట్లు భువి కవులు కల్పించినారో ?
వాని నేరీతి గనువారు యీ భూమి
సర్వభూతమయుండు సత్యమేవాడు
పాములిల వాని కాభరణాలు గావు
గంగ వానికి భార్య గాదులోకాన
మెచ్చి మూడవకంట చిచ్చు నిడలేదు
సిగను చంద్రుని పువ్వుగా జేర్చలేదు

విసము కుతుకను నించి మసి యవనులేదు
మందభాగ్యుడెవండొ మైమరచి బల్కు
అందరీ భువివాని యట్లు నారాధింత్రు
అత్మ కర్థముగాని అవని పనులన్ని
అనుసరించిన పాప మనుపించలేదో ?

ఓ హెూ మహేశ్వరా !

ఓ నా పరాత్పరా !

నీకు ఈశ్వర నామ మేకతనయున్నా
నాకు భక్తియె జగన్నాథ ! నీవన్నా ?
కాని పోనివి యన్ని కల్పించి నిన్ను
మనిషివని నమ్మి రీమనుజవరులంత
భక్తి శూన్యంబయ్యి ప్రబలె కంభక్తి
అటుగాక నీకు యీా అవతారమేల ?
కవులు కావ్యాలెన్నొ ఘనముగా వ్రాసి
భువిజనుల మరపింప బూనినారేమొ ?
మానవులె దేవులని మరచినారేమొ ?
మరచి కవులే జనుల మరపించినారో ?
సంఘ నిబంధనాశక్తి కెవ్వాడు
అడ్డుకొని నిల్వ నర్హత గాంచు భూమి ?
జానకీ భూమి గర్భాన జనియించెనట
పుట్టకొక్కొ ! భూమి బుట్టుటకు సీత !
ఇల పురాణములు విసుగెత్తించు వినిన
వినకున్నవాడు విహీన మతియంటి

కలవారి యింటిలోపల బెంచినంత
రాముడామెను వివాహము నాడెనంట
భూమి బుట్టినయట్టి పాలతి పెట్టియలో
పెట్టి యుంటకుగల ప్రేమ యెయ్యదియో ?

వ. అంతనొక సుకుమారి ఆ తోట మార్గమున వచ్చుచున్నది. దానిగని కవి ఈలా అంటున్నాడు

అదుగొ సుకుమారి! ఆ అతివ యెవ్వతెయో
పసిగందు నెత్తుకొని పర్వెత్తి వచ్చు
ఎవ్వరో మదికి నూహింపగా రాదు
యువతియన దోచు కనుగవ మేరనామె
శంపాలతకు వన్నె సవరించు మగువ
కనిన విద్యాధరాంగన యట్లుదోచు
ముంచు మోహాంబుధుల ముదిత దిక్కరయ
కురులు బారెడు మేన వరలి యాడంగ
కారడవి యిటురాను కారణంబేమి ?
కసిగందు చంకన కదలునది యేమి ?
కంపించి పోయిన గళరవము సెలగ
చింతించు తప్పేమి క్షితి దలచి తలచి
కాళ్లు భూమిని మోపగా వణకులెత్తు
కన్నీరు కాల్వలైగారు చెక్కులను
కాశి పూసలు మేన కదలినటు దోచు
శంకించు నేదొ యోచన జేసి మగువ
విశ్వస్తయన మదికి వివరించె బుద్ధి
ఈ అమాయిక బ్రతుకు యేరీతి గడచు

యవ్వనంబంత సోహము జేసినారు
దానికెక్కడిది సంతాన మీ పృథ్వి ?
అమెకడ భోషాణ మగుపడును యొకటి
పట్టి చేతులనెత్తి పెట్టెలో నిడగ
అందుకే అతివ యియ్యెడ కేగుదెంచి
పట్టి చేతులనెత్తి పెట్టెలో నిడును
ఇదిగాంచ విశ్వస్థయని విదిత మవగ
అరరె! దీనికి పట్టి అవతరించెడిదెట్లు ?
ఆమాట కొడిగట్ట ననియొ ఈ పడతి
పట్టి చేతులనెత్తి పెట్టెలో నిడును
అందుకే పడతి యియ్యెడ కేగుదెంచి
ఈ మాయకార్య మూహించి జేసెనొకో ?
సంఘమందలి ధర్మశాస్త్ర బంధనల
తప్పలేకయె సీత తల్లి యిటుజేసెనో ?
పోయి చూచినదెవరు భూమి దాయంగ
గర్భ జనితంబైన కన్నబిడ్డలను
చంపి పాతగ సాహసం బెట్లువచ్చు
అంతపని కొడిగట్టు అతివ ఈ జగతి
తలయెత్తి మరల ధాత్రిని దిరుగ గలదా !
ఆ తల్లియే గంగ వాతబడె నొక్కొ
ఈతల్లి వెనుదిరిగి యింటి కేతెంచు
పెట్టెలోపల పట్టి బుట్టినాదంచూ
ఊరెల్ల జెప్పుటకు ఊహించినాను
"తల్లి ప్రేమకు మించు దాతృత్వ మవని
తరచినన్ గనుదుమే దైవమ్ముచెంత

తప్పు లోకము గనక దాచినవాడు
ఫలితానుభవము తప్పక గుడువ వలయు
తప్పుజేసిన దాచు చెప్పు వేరొకటి
వాని కవనిం రెండు వంకల తప్పె"

వ. **అని యివ్విధంబున రామాచార్యుడు తనమనంబు నెంచి రామాయణ కథా విధానంబు ఆత్మగతంబని మరల సీతామాతను గూర్చి ఈలా అనుకుంటున్నాడు.**

ఓహొ మహేశ్వరా !
ఓ నా పరాత్పరా !
పరమ పాతివ్రత్య భక్తి నలరిన సీత
విశ్వస్థ గనిన దన వినునెవడు పృథ్వి ?
ఈ కఠోరపు వాక్య మెవడుచ్చరించు
వాడు పశువన ధరణి వరలక యున్నె
హరహరా ! అపవిత్ర మగు భాషణములు
చెవిజొచ్చె భరియింప సీతా సవిత్రి !
ఆత్మ భావవిదుండు అవని వాల్మీకి
ఆదికవియన భూమి అవతార మెత్తి
అట్టి పుణ్యాత్ముచే నవతరించిన విమల
రామాయణము భక్తి రాజిల్లె పూతమై
మధుర ఫలరస భరితమై యోగి శుకునోట
నుయ్యాల లూగించె నుర్వీతలమునెల్ల
రామాయనిన యెల్ల రావణాసురు లవని
నేల గూలి తరించెనే దాని మహిమ గన
నిఖిల ఖండాలెల్ల నిశ్చేష్ట మయిపోయి

రామ! రామా! యంచు రహిమించె బుధు లవని
దేహి దేహముల సందీప్తి నించియు భుక్తి
ముక్తి యొనరించు సంపూర్ణ రామాయణము
ఈశ్వరుడె నరుడుగా యేతెంచి భూమి
రామనామము తోడ రాజ్యంబు నేలె
నరుడె నారాయణుడు నరులార వినుడు
నరుడు ఈశ్వరునైన మరపించువాడు
అది ఈశ్వరుడైతె అదినరు రాముండు
రామనామమె నాడు రాజిల్లె దేవుడని
అందుకే వాల్మీకి అవతరించాడు
అందుకే కవిగాను అవని మనినాడు
అతని కన్నను కవిత అమరమ్మునయ్యో
అమరమే కవితాత్మ అల్లుడిక కవితా
నరుడు నారాయణుండనియె వ్రాయండి
రామరాజ్యము నాడు రాణించు జగతి
వినరె రామాయణము వివరింతు వేడ్క
వినిన పరమజ్ఞాన మెనయు భువి నరుల

సీ. ఏదేని మహిమచే ? నెసగె సత్కీర్తి వా
ల్మీకి రామాయణమే దలంప
ఏదేని మహిమచే ? నిహము భక్తి దరించె
శబరి రామాయన్న చలువగాదె ?
ఏదేని మహిమచే ? నిల ముక్తి నొందెనా
గుహుడు రామాయన్న కుతుకముననె
ఏదేని మహిమచే ? నిహపర ముక్తుడ
య్యేను విభీషణుడు రామనినగాదె ?

గీ. అట్టి సుపవిత్ర నామ మాహాత్మ్యముననె
ఎల్ల బుధులు దరించిరీ యిహము, పరము
శివుడు రాముడు, చెల్యుడీ చిత్తమందు
దలపుడీ రామ శివుల యథార్థ మతుల.

తే. సపుడె నారాయణుండని యెరగునాడు
రామరాజ్యము యేతెంచురా! జగము
నాటి వేదాంతమే యిప్డు పాటవమ్ము
రామరాజ్యంబులో రైతు రాజుకాగ.

తే. మేఘుడే ఈశ్వరుడు భూమి మిథ్యకాదు
నాటి వేదాంత సారమ్ము మేటియయ్యో
నేటి వేదాంత సారమ్ము మేటికాగ
మేఘుడే రాముడోయి రాజు రైతురయ్యా.

రాముడే మేఘుడై మేదినీ వర్షింప
రాజుగా సుశ్రీల రైతు పంటల గూర్ప
కవికి కరువేముంది భువికి కరువేముంది
కడుపు గాలదు కవికి కడుపు గాలదు భువికి
రైతు రాముని దలచి రాజిల్లు డికజగతి
రైతు రాముని గూర్చి రాయండి కవితమ్ము
రావోయి ఓ మేఘదేవా! మము జూచి
పోవోయి కరుణానుభావా!

వ. అంటూ రామాయణమును గూర్చి కవి ఈలా అనుకొంటున్నాడు

ఆ. రామ నామమందు రమణి సీతామాత
సతిగ ముక్తి వడసె సంస్తుతింప

భూమి గర్భముననె బుట్టి సీతాసాధ్వి
సీతలేక జన్మ స్థిరతలేదు.

ఆ. ప్రతి ప్రకృతి జీవి పరమ పావనరామ
నామ ధారియగుచు నయతగాంచు
రాము డవని లేక రాణించు నెయ్యది
రాము నరసి మెల్గురా జగమున.

ఎవడురా! రాముండు దలపగ
నెవడురా! లక్ష్మణుడు నిలపయి
నెవడురా! రావణుడు తెలుపగ
ఎవరురా! సీతా సవిత్రి
ఇహము గని పలుకఁ
ఎవడురా! హనుమంతు డంగదు
డెవడురా! భువి కుంభకర్ణుడు
ఎవరురా! మర్కట చయములన
ఎవరురా! మండోదరీమణి
భువిని గని పలుకన్
జ్ఞానమే రాముండు గాదే ?
బుద్ధియే లక్ష్మణుడు గాడే ?
చిత్తమే సీతమ్మ గాదే ?
చెలగి తెలుపంగఁ
రావణుండు దశేంద్రియము లన
రావణుడె దశకంఠుడను మది
ఆత్మ హనుమంతుండు యనియెద

అవని మనరండో!
కోతులన సంకల్పములె యిల
కూడి వారధిగట్టి నారన
మోదమొందుడు జానులారా!
మోక్ష మార్గమునన్
నాతి మండోదరియె మాయో
పేత; రావణు భార్య; కుంభా
కర్ణుడే నిద్రాపతియు నని
కనుడు జనులారా!
రామజ్ఞాముని పరవశంబై
భూమియను దేహమును పాలన
జేయ బడుచుండగను సీతా
చిత్తమున్ గనియున్
ఆశయను దయ్యమును గూడిన
మోసకారి దశేంద్రియంబులు
పాశమున బంధించి సీతా
వేశమును దెచ్చెన్-
చిత్తమను సీతా సవిత్రియు
తత్తరముబడి మొత్తుకొన నె
గ్గెత్తు రావణు గర్జనల తా
వత్తిగిలి యుండన్-
అయ్యో సీతా! యనుచు రాముడు
అయ్యో లక్ష్మణయనుచు బుద్ధిని
నియ్యగొని జ్ఞానంబు హనుమం

తయ్యొ మనసునకున్
జాడగొని రమ్మంచు బల్కిన
కూడి సంకల్పముల కోతుల
ఏడు భువనమ్ములును దిరిగియు
జాడగనె సీతన్-
చంద్ర శకలము భాతి గులికెడు
చాన శంపాలతను చిత్తము
జ్ఞాన రాముని బాసి దుఃఖ
మ్మాని సీత మనన్-
రుచుల మరగిన యింద్రియంబులు
అచల మార్గము నెరుగ లేకను
చపలమున రావణుడు చెలగియు
జానకిని గాంచి
నన్ను గూడవె, నాతిరో హెూ!
సన్నుతించి యటంచు అన్నులు
మిన్నులను కన్నులను గాంచక
మిడిసి పడ వేగన్-
అంజనేయుడు అగ్రహమ్మున
అసుర రావణుజొచ్చి అసురత
భస్మ మొనరించియును రాముని
పాలికిని జనియెన్
రామ! రామా! నీదు కరుణచె
రావణుని రాక్షసత గాల్చితి
నీవు సీతామాత కొరకై

రావణుని జంపన్
రావలెను రామాయటంచును
రామభక్తుడు బలికి నంతనె
నిమమున రావణుని గూల్చగ
రామలక్ష్మణుల్
పోయి రావణుగూడి రాముడు
భూమి బోరున యాజి సల్పగ
కుంభకరుడు గూలె నేలను
గురుత రామునిచే-
అంత రాముడు రావణుని ది
వ్యాస్త్రమున గూలంగ జేసిన
భామ మండోదరియు నాగతి
యేమియని బలుకన్
రావణుడు బ్రతుకుట యసాధ్యము
నీవు యిల మనుటదియు సత్యము
గావుతని దీవించి రాముడు
కాంక్షతో సీతన్
వేడుకలరగ చిత్తమున తా
గూడి యుంటకు సాహసించిన
పాడురావణు చూచు చిత్తము
ఏడ నిలచునన్
చాకలను రక్తాణు వుడికిన
జోకతో రాముండు నిజమని
తనదు జ్ఞానాగ్నియును సీతను
జొనపి నంతయునే

పగిలి పోయెను పాడుదేహము
రగిలి పోయెను జ్ఞాన రాముడు
ఇదియె రామాయణము నౌను
ఇది యనంతమయమ్
దీని యర్థము దేటపడకయె
మానవులు యాజులను జేసిరి
దేనికో యీ పాడు యుద్ధము
మానవుని కిలలో
శాంతి నిల్పెను భారతావని
శాంతి జాటెను భారతీయులు
శాంతి సందేశమ్మె భారత
జాతి జీవనము
వినుడు మానవులార ! సమగతి
మనుడు భారత వాసులారా !
కనుడు జాతికి భేదమేలా
కరుణ మతిచెలగన్
అదుగొ ! అటంబాంబు దానికి
అదుపు, మహదాంబుధియె శాంతి
శాంతి విశ్వము జాటి దేశ
క్రాంతి నింపుడు సుజనులారా !

వ. ఇవ్విధంబున రామాచార్యుడు ఈశ్వరుని దలచి తనమనంబున.

ఓహో మహేశ్వరా !
ఓ నా పరాత్పరా !

ఈ శరీరము మాయయేయంచు నమ్మినను
ప్రతి రూపమై దేహిప్రబలుచున్నది జగము.

ప్రకృతి ప్రతిబింబమై ప్రభవించు టదిగాంచి
ప్రకృతి వికృతియనంగ బరగు గాదె జగంబు
ప్రకృతి పరమాత్మునకు బాహ్య దేహంబునై
ప్రకృతి పరమాత్మునిల ప్రబలె వికృతిగూడి
ప్రకృతి వికృతిని నొందు పరమాత్ముడే దివ్య
జీవయుతుడన వెల్గు చావకుండగ వాడు
ప్రకృతి జానమె పరాత్పరుడంచు దోచుమది
ప్రకృతి పురుషుడు పరాత్పరుడు గాడె జగమున

లేదు ప్రకృతికి చావు.
లేదు జీవికి చావు.
లేదు శివునకు చావు.
లేదు నరునకు చావు.

చావు పుట్టుకముందు చావు పుట్టుకకలదు
దీని నెరగినవాడు దేవుడై కవియగును
కవిత పిచ్చిదిగాదు కవిత ప్రాణిసమమ్ము
పరమ శివు దేహమున ప్రభవించితిమి మనము
పరమాణువులతోడ ప్రతిరూపమౌ భూమి
కనుపించుదానిలో కనుపించు మరియొకటి
కనుపించుదానిలో కరుణామయుడు శివుడు
కాంచుడో జనులార! కరుణామయుని శివుని
అతని ప్రతిరూపమీ అవని పూజించుడిక
అతని దేహము భూమి అతని రూపము పరము

అందుకే హింస వద్దంటారు బుధులు
అందుకే యుద్ధ మొద్దంటారు కవులు

తల్లి తనయునిగాంచి తలచు ప్రభువనిమదిని
బంగారుకొండ నాభాగ్యమని ప్రేమించు
అవ్విధిని భక్తుడిల అవనీశ్వరుని గూర్చి
ప్రేమతో విశ్వప్రియు ప్రేమించెనో యిట్లు
అతని ప్రతిరూపమీ అవనీతలమటంచు
అతని శీర్షము హిమోత్పర్వతంబని యంచు
అతని జీవమె సూర్య శశిగతుల పయనించు
అతని సంకల్పములె దివి తారకలటంచు
అతని రక్తము జీవనదులుగా ప్రవహించు
అతని యెముకలు పర్వతములు గుట్టలటంచు
అతని జ్ఞానము అంతులేని ఆకాశమని
అతని ఉచ్ఛ్వాస నిశ్వాస యీగాలియని
అతని జీర్ణ పదార్థములె యగియని మదిని
అతని రోగములు గ్రహబాధలే యనుకొని
వాడులేకుండ జగమాడునే రీతియని
స్మరియించెనే జన్మ తాదాత్మ్యముంజెంది
పెనుగులాడెదరేల పెద్దవాళ్ల మటంచు
వాదు జేసెదరేల భేదభావము బెంచి
దేవుడున్నాడంచు దివ్యమతితో మీరు
దేవుడే విశ్వమని దీవించు డికనన్ను
నామతమె గొప్పంటె నామతమె గొప్పయని
నాకులమె గొప్పంటె నాకులమె గొప్పయని
నాజాతి గొప్పంటె నాజాతి గొప్పదని
వర్గ భేదాలతో వరగి పోయెదరేల ?
ఓ దేశభక్తజన పోషకమ్మణులార !

నీదేశ భవ్యోపదేశ మంజుల ఘోష
వినుడి వినుడీ వినుడి విశ్వమానవులార !
వినుడి, యిటు మనసుంచి విశ్వహిత మతులార !
రైతు రామాయణము రాయండి కవులార !
మేఘ శివునిందలచి మెలగండి జనులార !

ఇవె నేటి కావ్యాలు
ఇవె నేటి భాగ్యాలు

పెంట కుప్పలె మనకు పీయూషములనిచ్చు
పీయూషముల ద్రావి ప్రేమించిలోకాల
భోగభాగ్యాలెల్ల భువినింద వెలయించి
సుర సౌఖ్యములదేలి సోలి పోదామోయి
సురలోకములనాడు చూచి వత్తామోయి
స్వర్గ భ్రమలానాడు వదలి వేస్తామోయి
భువి బ్రతుకు నన్నాళ్లు భూమినే కొలుతాము
భువిజచ్చి దివిబ్రత్క దివినే స్తుతింతాము
రండోయి జనులార ! రైతులై బ్రతకాలి
రైతులై బ్రతకాలె రాజ్యాలు యేలాలె
రాజ్యాలలో రత్నరాసులే నింపాలె
వర్షమ్ము కై నిండుహర్షమ్ము జూపాలె
మేఘమ్మునే గొలచి మెతుకు సాధించాలె
రైతు రాముని దలచి రాజిల్లుదామోయి.

వ. ఇవ్విధంబున రామాచార్యుడు రైతురాజును మేఘదేవునిగూర్చి

రావోయి ఓరైతురాజా ! మము జూచి
పోవోయి వోమేఘదేవా !

భూమిలో రత్నాలు పొర్లించుతారంట
కాముకుల మెడదీర్చి కడుపు కాలెదరంట
కవి మిమ్ము మేల్కొల్పి కష్టాల కడబాపు
కవులందుకే పుట్టి గడుపాలె బ్రతుకంత.

వ. అనిఇట్లు రామాచార్యుడు తనమనంబున తలపోసి భారతవసువైపు జూచాడు. భారత యిహ పరార్థముల నిట్లు చెప్పుచున్నాడు.

ఓహో! మహేశ్వరా!
ఓ నా పరాత్పరా!
చూడచూడగ గుర్రమే గాడ్డి యైనట్లు
ఈ ప్రపంచము మరో ప్రపంచమై కనుపించు
రెండు లోకాలెపుడు దండిగా యున్నవి
రెండు దెలసినవాడె దండివాడైపోవు
దండి నిల్పినయటి దండిదీభారతము
భారతము భవలవప్రాణ సముదాయకము
సమగతుల సమమతుల సమసిపోయిన సుఖము
ఎటుదిక్కు గాకుండ అటునిటుండె దయేను
అట్లుండ వలె కవులు అవని జనులందరును
అదె లోకమై వెల్గు అవని భారత కీర్తి
భారతముగని ప్రేమ భావముల ప్రకటించి
భారతముగని మీదు భాగ్యమని నమ్మండి
ఇదియే ప్రపంచం, ఇదె బ్రహ్మకల్పం, ఇదె ఈశ్వరత్వం
గర్జించె మేఘమ్ము వర్షించె భువినిండ
కర్షకులు మదిపొంగ హర్షించె లోకమ్ము
శాంతి విలసిల్లె........

# హోమ్ !

నాదాన్ని, ముల్లోక
వేదాంత ఘనదివ్య వేదాన్ని
రుంద్రోజ్వ లావేదనా దివ్యగీతాన్ని నేను !

విజ్ఞాన యజ్ఞాన్ని,
ఊహిస్తె భావం,
పలికింది గద్యం, పాడింది పద్యం,
శాంతి వేదికలందు శ్రావ్యరసవేద్యం

భువనాల
యువకవుల నవభావ నవగీతి నవలోక నవపేశల
నురాగ నవసుధార్ణవ వీచికలదూగు
భవ భారతీ వేదనారూఢ శోకాలు
నా మనో భావాలు !

నవవసంత విలాస పవన తరంగాలు,
మృదుల వీణానాద విమల గాంధర్వాలు,
నాగీతి కోటి తెల్గులు వెల్గు, శశికరము !

తరులు కిన్నరలు కల్వాలు నిండు సరులు
విరులు చందురులు ముంగురులు రమణీయం

ఇరులు నాశత్రువులు !
నాకు నేవర్గం !
వెలుగు నాదుర్గం !
ఉపస్స్వరం, యితరుల కసాధ్యం
నాతెలుగు, పద్యం !

# రుద్రవీణ

నేను సైతం
విశ్వశాంతికి
పావురమునై నింగి కెగసితి
నేను సైతం
జీవధాత్రికి
అమృతమై ప్రవహించి యింకితి
అగ్నిధారల అశ్రుతర్పణ
అమృతమై పెంచితిని సృష్టిని
నేను సైతం మానవాళికి
ముక్త కంఠమునెత్తి పాడితి
దాస్య శృంఖలముల బంధింప బడునాడు దేశం
అగ్ని ధారల నలమటించలేదా ?
కరకు రాచరికముల దలచియు
రుద్రవీణలు! మారుమ్రోగలేదా ?
శాంతి దేశ క్రాంతి గూర్పగ
నిలువు నీరై, మహేంద్రోదయ భేరిని
మ్రోయించలేదా ?
ఆకలికి అల్లాడు మానవ
లోకమును గని మైకునై నే
కేకలేసితి నాకు నేనై
నేనొకప్నే
లేకపోతె
కరుడు గట్టిన రాచరికములు

కుటిల మానవ నీతి వితతులు
దొంగ దొర వేదాంత బోధలు
తెల్గు భూమిని పాడుచేస్తాయి !
మేడ మిద్దెల నాడిపాడె
కలికి వలపుల కౌగిలింతల
కులుకు తళుకుల మెరయు హొయలుల
కలిసియాడె, సోలిపోయె, పేలిపోయె,
నా సహోదర మానవులనే
నిద్ర బాపితినో !
దాస్య దీనత ధ్వంస మగునటు
భావి దేశాభ్యుదయ మగునటు ధన్యమగునటు
శాంతినాదం జగతినిండా !
విస్తరించాలె !
వీరులంతా
ధాత్రినిండా నిండిపోయి
మానవోన్నతి మహోదయము
దండినిలపే సుముహూర్తాలు
అవతరిస్తాయి !
నేనుసైతం, జీవధాత్రిని విశ్వశాంతిని గోరి నిల్చితి
సృష్టికంతకు జీవదాతను
రైతురాజునె కీర్తినించితి
నేనుసైతం విశ్వగీతికి
విశ్వకవినే స్తుతించాను.
నేనుసైతం విశ్వశాంతికి
గాంధిదేవుని స్మరించాను.

నేనుసైతం మూడువన్నెల
బావుటానే నుతించాను.
రణము రక్తము కెదురుచూచే
రాజరాజుల బూజులన్నాను.
కవుల చరితలో ప్రజాకవియని మహాకవియని
మారుమ్రోశాను పేరుమ్రోశాను.

# భయనిర్భయులు

బ్రహ్మాస్త్రముల ప్రయోగించి భయపెడుతారా నన్ను
నిర్భయమున రాక్షసుడనై హరిస్తాను సమస్తం.
రాక్షసులై విషాలు గ్రక్కుతారా!
గరళకంఠుడనై ఆస్వాదిస్తాను సుమా!
మీరంతా మంచివాళ్లమని నన్ను పిచ్చివాణ్ని అంటారా!
నేను మంచివాణ్ని అనిపించి మిమ్మల్ని పిచ్చివాళ్లజేస్తాను

మీరు దేవతలా ?
రాక్షసుడను నేను!
మీరు రాక్షసులా ?
నేను దేవతను!

మీరు నేను కూడి యుంటామా ?
మానవులకు మహాశాంతి విశ్రాంతి గూరుస్తాము!
మనమంతా జగదేక వీరులము!
వసుధైక కుటుంబముగా వసియింతాము!
రండోయి! రారండోయి!! రా రారండోయి!!!

మేఘం ప్రగల్భించి లోకాన్ని ముంచజూస్తె
ఇంద్రధనస్సును ప్రయోగిస్తాను.
పూర్ణచంద్రోదయము లోకాన్నివిరహాగ్నిలోతపింపజేయదలిస్తే
ఆవిరి పోలిక కావిరినైలేచి బింబమునకు కాటుకరాస్తాను.

## కవీ! నీపద్యాల్!

మధుర పదయుత సుధలునించే
ద్రాక్షరసమో ?
కఠిన పదవిన్యాస రోచిర్ నిర్మితాయత
నారికేళమొ!
మత్తమధురిమ రాగరవములో
కవీ ! నీపద్యాల్ !

మలయ మారుత విహంగాలొ,
పటుతరధ్వని మృదంగాలో,
విమల సాగర తరంగాలో,
కవీ! నీపద్యాల్ !

తెలుగు కవిత తియ్యదనమొ ?
ఆంధ్ర భారతి అలంకారాల్,
భక్తిరస ప్రణయోహ సంస్కృతి
కవీ! నీ పద్యాల్ !

ప్రణయ మంజుల ముగ్ధలాలస
విలసనము రాగోదయము శృం

గార, కరుణా కలిత వీర
రస విరహములు తన్మయములు హాస్య విస్మితము,
కవీ ! నీ పద్యాల్ !

ఉత్ఫుల్ల పద్మ, చకోర, రాగ
విహార, గుంఫిత ధ్వని మనోహర
కోకిలారవముల విలాసమ్
కవీ ! నీపద్యాల్ !

వసంతోదయ సమాగమము
వికాసావృత హేమంతాలు
శిశిరజ్యోత్స్నలు పసిమిరాసులు
కవీ! నీపద్యాల్ !

తారా శశాంక శుభోదయ వి
లాస ప్రణయ వినోద సస్మిత
విస్మయ మనోజ్ఞ ప్రకృతి శోభలు
కవీ! నీపద్యాల్ !

కలువ రాణుల పలువరింతలు
మత్త మధురిమ మధురరాగం
మోహినీమణి విరహతాపం
వేణునాదం మహానందం
కవీ! నీపద్యాల్!

కవీ! నీహృది భవ్యమంగళ
మహా భక్త్యుదయ మహెూదయ
మహానందం జన్మధన్యం
సార్థకము పద్యాల్!

7)

# ఉదయోన్ముఖులు

విప్పిన కన్నులు చెప్పేదేమిటి ?
చూచినలోకమ్ పొందిన స్వర్గం!
పలికే గుండెల పిలుపు లవేమిటి ?
మిన్నుల మన్నుల విరులై తరులే!
కులికే ప్రణయుల దలచేదెవ్వరు ?
మధుహతి సద్గతి
సుమతి, సుహృది.

# ఇహతలితలపులు

ఇదేమిటి మదనరాగం ?
హృదిలో వేణునాదం!
ఇవేమిటీ అనందోహలు ?
కదలే నాహృదయ వీణాతంత్రులు
అవేమిటా వెన్నెల వెల్గులు ?
ఆనందం భ్రమరానందం అమరమ్!
ఎక్కడిది కెల్లు దీ వెన్నెల
ఇహతలి వలపుల నింపగ
తన్మయానందము గూర్పగ.

# పరమార్థము

గాంధిదేవుని శాంతి బోధలు
భవ్యభారత మంటపమ్మున
ప్రతిధ్వనులై పరిఢవిల్లాయి
విజయ గంటలు మారుమ్రోగాయి-

సుప్తలోకపు మానవాళి
తెలివి తెచ్చుక ఉలికి పడ్డారు!
సుప్తలోకపు భుజంగాలు
విషము గ్రక్కుచు ఉలికి పడుచు
పడగవిప్పి బుస్సుమన్నాయి-
భరతదేశపు సింహనాదం
ప్రతిధ్వనియై మారుమ్రోగెను!
శ్వేత వేదండాలు సైతం
బాటబట్టాయి పర్వులెత్తుచు భయమునొంది-

శాంతి పాలన విస్తరించి
స్వర్గడోలిక తూగెదేశం
శాంతి దూతా
సత్య అహింసల
వెల్లి విరిసెను పంచశీల
భవ్యభారతి మంటపమ్మున
పరిఢవిల్లెను జ్ఞానసంపద.

# యుగోదయము

ఓహో !
ఓహోహో !! ఓహోహోహో !!!
శాంతి విలసిల్లింది
జగత్తు సంతోషించింది
ఓహో !
ఓహోహో !! ఓహోహోహో !!!
కురుల విరులు ముడిచి
ఖద్దరు చీరగట్టి
మోహినిలా నర్తిస్తున్నది అహో ! అదుగో !
శాంతి దేవతా విన్యాసం
అమృతాయత నవహాసం.
నాలో నాకే సంతోషం
అదుగో !
అదిగదుగో !! అదిగది గదుగో !!!
విరిసిన వికసించిన వివరించిన
గులాబులు !
నవమన్మధుల నవమోహినుల
వేణునాదాల్ మహానందాల్
ఇపుడే !
ఇపుడిపుడే !! ఇపుడిపుడిపుడే !!!
విశ్వశాంతి మహోదయము
మానవాళికి శుభోదయము
నవభావన కళామయం.
శుభోదయం మహోదయం
కళామయం.

# నవకవనానికి

క్రాంతి క్రాంతి భ్రాంతి
ప్రేమ రాగము
చలువవెన్నెల చౌకలింతల
భానూదయము ఉషోదయమై
మూడువన్నెల కేతనద్యుతి
గాంధి దేవుని హితోపదేశం
కదురు ఖద్దరు చరఖా ఉద్యమ
నిర్మాణానికి మంగళగీతులు-
కవితావేదన రసవిస్మితము
కావాలోయి నవకవనానికి-

మత్తెక్కిన మానవలోకం
ఎల్గెత్తుక సాగేటందుకు
కావాలోయి కవితావేశం-

పొలెత్తిన దాస్య దుస్థితి
ఘూలెత్తిన కుటిల ప్రయత్నాల్
రగిలించే పర పీడనలు
మండించే రాక్షస చర్యలు
దండించే యమధర్మాలు
ధ్వంస మొనర్చే కవితావేశం
కావాలోయి నవకవనానికి-

భవితవ్యపు పౌరసంతతికి
భవభయ నిర్దేశ వచనాదేశం

భక్తిభావ ప్రేమోదంతాలు
వినసొంపులు నింపగలట్టి
నవనీత సుధామయరాగం
కావాలోయి నవకవనానికి-

అడవులలో హాహారవముల
పడి మ్రూల్గే పేదమానవుల
అజ్ఞానం అంధకారం
మొండీగారడీ పశువిజ్ఞానం
నశింపజేసే రుద్రజ్వాలలు
కావాలోయి నవకవనానికి-

చదివేది చదివించేది
చూపేది చూపించేది
పలికేది పలికించేది
కదలేది కదలించేది
ఆడేది ఆడించేది
కావాలోయి నవకవనానికి.

# ఆ శా జీ వు లు

స్వప్నాలలో దివ్య
స్వర్గాలు నిర్మించి
సుఖ సౌఖ్యముల డోలికలనూగు ఒకడు-

పంటలే పండించి
భాగ్యాలు వెలయించి
జగతిజీవుల జీవదాతయై పస్తుండు ఒకడు-

భూలోకముల జూచి
ఆకాశముల కెగసి
లోకాల శాంతిసందేశాల ప్రకటించి, ఏడ్చు ఒకడు-

పట్టు పరుపులలోన
మందహాసము జిందు
సుందరీమణిచేత చందన తాంబూలముల ననుభవించు
చంద్రోదయ వేళ నొకడు-

ఈ ప్రపంచములో, తమలోన తామె
కోరికలు తీరక వేదాంతబోద్ధలై
విరాగులై బిక్షువులుగ అనాధులుగ కవిపండితులై
భాగ్యవంతులై, లక్ష్మీపుత్రులై, మసలుచున్నారు.

## ఆవేదన నివేదనం

ఆనందం అంతులేని మహాసముద్రం
జ్ఞానము తుదిలేని తాకరాని ఆకాశం
భావుకుడు చూస్తాడు ఈరెంటిని
ఈదగలడు సముద్రమున
విహరించగలడు ఆకాశమున.
ప్రకృతి పరిరంభములో

నా తనువు నిర్వాణము
చెలరేగే గాలిదుమారం
నా జీవన సందోహము
భగభగమండే అగ్నిజ్వాలలు
ప్రాణాహుతి కాహారము
వలపించే కలికి చూపుల తూపులు
నా సుకుమార హృదయానికి బాకులు
చచ్చే సంతానాన్ని సృష్టిస్తాను
ప్రపంచములో జీవిస్తాను
ప్రణవ ప్రహసనాల విలాసాలు
దాస్య జీవనుల తలపోస్తాను.
వికసించిన నా సంతోషపు వెన్నెలలు
విష జర్జరిత దుఃఖ నిశీధులు.
రెండుకూడి యాడిననాడె నా
డెందములో మందాకిని-
నాడు ప్రపంచాన్నిముంచి చచ్చి
నూత్నలోకాన్ని రచిస్తాను వచ్చి
విమల సలిల సమీరములలో
గుంఫితధ్వాన చిలుకా కోకిల పలుకులు పాటలు
హేమంత రుతుపవనాల తుషారాల ప్రగల్భించి
తుపానుల వెలయించి నా పరిపాలన సాగిస్తాన్.
జీవకోటి సమస్తం కళకళలాడంగ
చిమ్మచీకటి రాకసినై హరిస్తాను సమస్తం
గరిక గర్భమున జన్మించిన జీవిని

పూలతోటలలో జాలి పాటలు పాడ్తాను.
చిగురు టాకై కాష్ఠమై విలసిల్లినయంత
శ్మశానవాటిక జ్వలన జ్వాలలు చెలరేపి
ప్రపంచప్రళయం అవతరింప జేస్తాను
మూగయోధునై నిర్గమిస్తా
కావిరితోగూడిన అవిరినై ఆకాశానికెగసి
మబ్బుపట్టి వర్షముగా వర్షిస్తాను భువిపై
సప్తసముద్రాల హొరుగాలిలో
సూర్యుని సృష్టించి భూమిని వెలయించి
విశ్వసనాథనై జీవదేవతగా
ఉద్ధరిస్తాను లోకాన్ని
ప్రపంచాని కధినాధుడను నేనై
పరిపాలిస్తా నీవిశ్వసృష్టిని
నా పే రు మా న వు డు.

## ఆ ట ం బా ం బు

ప్రకృతి వికృతి శోభావళిలో
దేహి దేహముల జీవరాసులు
స్వర్గమయ సౌఖ్యానందములు
నరక దుఃఖ బాధా బుభుక్షువుల బూకలు
మంచిచెడ్డ కీర్తి అపకీర్తులలో
బోధించిన ధర్మాధర్మాలు
విజ్ఞానశాస్త్రాలావిర్భవించి

వివరించాయి - నివేదించాయి
ఇదేమి ! పాలన, రామరాజ్య పరి
పాలనమున, రాక్షసులను హతమార్చిన
రామబాణము జగచ్ఛాంతి
విధానమున నోలలాడగ సంపన్నమున
జాతి మత కుల వైరభేదా
ఘాత హేతు ప్రళయాగ్ని హూతము !
అదో ! అగ్నిగోళమువలె ఆటంబాంబు
భస్మాసుర హస్తాల బెదరింపులు, విషసందోహాలు
ఆటంబాంబుల ఆవిష్కరణము
ప్రపంచ ప్రళయం ప్రదీపింపగా
సమస్తలోకం మృత్యు ముఖస్థలి
ఆహుతి అగుటకె ఆటం పుట్టెను.

## జలపాతం

జలపాతం ! జలపాతం !!
జలపాతం !!!
పొంగిపొరలి ప్రవహించిన
స్ఫుట నటనాన్వేషగమన
స్ఫూర్తి మూర్తి విన్యాసం.

జలపాతం ! జలపాతం !!
జలపాతం !!!
సుజనహృదయ సముపేతం

కుజన హృదయ జర్ఝరితా హతం
కృష్ణానది తుంగభద్ర
గోదావరి సుఖనిద్ర
మయ బౌద్ధ స్వరూపమ్ము-
నాగార్జున సాగరమ్ము
ముక్కోటిస్వర తెల్గుల
చక్కదనము సమకూర్పుల
పాడియావు యశోరాశి
పంటలకది ఉషారాశి
రాయల పరిపాలనమున
రాజించిన వైభవమ్ము
కవి కోకిలలై కూసిన
కర్పూరపు యుగశకమ్ము
శ్రీమన్నారాయణ స్మృతి
శ్రీవిభవకృత మహాకృతి
శ్రీసుశ్యామలము నాంధ్ర
శ్రీకపూర్వమమృత శ్రీ
తెలుగు కవిత సుగుణశ్రీ.

## ప్ర తి జ్ఞ

ప్రపంచ ప్రళయం
పరిభ్రమించే
అటంశక్తిని అర్పేయంగ-
ప్రపంచ సృష్టికి ప్రాణాల్ నిల్పగ-

ఆలోచించుడు అహర్నిశలు యీ
ప్రపంచపాలన పరిపాలింప
హర్షోత్సాహము వెలయింపా-

శాస్త్రజ్ఞానుల విచారసారము
ప్రపంచానికి
పరమార్థానికి
ప్రదీపింపగా ప్రకాశయుతమై
ఆటంబాంబుల ఆర్పేయండోయి-

ప్రపంచశాంతి ప్రవర్ధిలంగ
ప్రభాసింపగ మానవచరితలు
శాంతిగీతముల వినిపించాలని
ప్రపంచమంతా హర్షమునింపా

రాత్రింబవలు దీర్ఘసమాధిలో
ఆలోచిస్తూ
అఘోరిస్తూ
ప్రపంచశాంతిని భగ్నమొనర్చే
ఆటంబాంబుల ప్రళయాగ్నులనూ
అదరింపులను
బెదరింపులను-
విషాదమయమీ ఆటంబాంబుల
ఆర్పేయాలోయ్ ఆలోచనతో

నూతనభావము
కాంతిని నెరపే
పద్యాల్ వ్రాస్తూ
కవులై విశ్వశాంతి సంస్థాపకులై

ప్రకాశింపవలె
ప్రదీపింప వలెనని
విప్లవస్వరాల వినిపించండోయ్
విప్లవస్వరాల వినిపించండోయ్

## బ్రహ్మ రాక్షసులు

దగాకోరు వేదాంతార్థమ్ముల
బుగుల్ రగిల్చిన వేదవేద్యులు
యుగయుగాలుగా పేదల రక్తం
నేతి ధారలని పీల్చేశారోయ్ !

మా కాయుష్యం మాకారోగ్యం
మంత్రాలే పఠించారోయ్ ! కు
తంత్రాలే ప్రకటించారోయ్ !

చదువుల సారం నిస్సారంరా !
ప్రపంచమంతా శూన్యంబేరా !
శూన్యములోపల దేవుడున్నడని
సూక్తులు జెప్పిన వేదాంతులురా !

మీశిరములు మాకాళ్ళ మ్రొక్కితె ?
స్వర్గభూములను చూపిస్తామని
ప్రాణాల్ బాపిన బ్రహ్మరాక్షసులు
యుగయుగాలుగా కుట్రలుసల్పి
ధరిత్రి వెలసిరి ధర్మాత్ములునై.

రాజులు బూజులు గండర గండలు
స్వర్గలోలికల వేదార్థమ్ముల
వర్గభేదహిత ఒయ్యారమ్ముల
పేదలరక్తం పీల్చేకారోయ్ !

చచ్చేదంతా సర్వాబద్ధము
బ్రతికేదంతా ఘన వేదమ్మని
ప్రపంచ పరమార్థము తెలియండోయ్ !
బ్రహ్మరాక్షసుల భయపెట్టండోయ్ !

ధరిత్రిలోపల చరిత్రలన్నీ
దేవదానవుల సంగ్రామాలే !
మానవ చరిత్ర మంటగలపినార్
దేవదానవుల దివ్య దేవుడగు
మానవ చరిత్ర మరువక వ్రాయుడి-

వాడులేని జగమంధకారము
వానిచరిత్ర ధరిత్రికి జీవం
విశ్వవిజ్ఞానశాస్త్ర మంటపమునకు మూలస్తంబం

యుగాలతరబడి ప్రకృతి వికృతి మార్పులకు తేజం
నవోదయానికి మహోదయానికి మానవచరిత్ర ప్రాణం
శాంతిదాయకం, విప్లవరూపం, మహోదయం.

# కవిద్వయం

మహాకవి దాశరథి
మహాకవి శ్రీ శ్రీ
"అగ్నిధార; రుద్రవీణ"
"మహాప్రస్థానము"
విశ్వామృతముగా
విలసిల్లినాయి
ఈకవులు విశ్వదాతలు
వీరిరువురి గుండెలు
మహాగ్ని గోళాలు
రుద్రవీణలు అగ్ని
ధారలు పార్వతీపతి జ్వాలనజ్వాలలు—
మహాప్రస్థానము
చెలరేగిన, శివతాండవము—
ప్రకృతి పరమేశ్వరుని హరించెను
వికృతిరూపమై విలసిల్లెను యీలోకం.
శాశ్వతమైనది వీరిద్దరి కవిత
అమరమైనది ఈలోకము.

ప్రస్తావించితి వీరిప్పురను
కదలినవి గుండెలు
కలముచేత బట్టినాను
వెలసింది మహాప్రపంచము
నాజీవితము ధన్యమైనది
మాతల్లి కడుపుపండినది
నాకిదే పదివేలు.

## ఆహుతి

అగ్నిగుండమున ఉడికేఅన్నం
ఆరగించె జీవకోటి సమస్తం
అన్నమునకు ఆహుతియయ్యె ఈలోకం
దానవాచార్య సంతతులకు చీకట్లు ప్రాణాలు
దేవతాగణ వితతులకు వెలుగు ప్రాణసముదాయకము
చీకటెలుగుల మిశ్రసంయుతులు మానవులు
భానూదయములో జీవిస్తారు వీరు త్రివర్ణముల
ప్రకాశిస్తు త్రికాలాల విహరిస్తు త్రేతాగ్నుల
త్రిమూర్తుల జయించిన మానవులు మహాదేవతలు-
త్రిమూర్తులకు అనాది దేవాంశము మానవాంశము
చీకటిలో జనించి వెన్నెలవెలుగులలో విహరించి
ప్రభాత కిరణామృతా స్వాదనులై
ధరిత్రి చంక్రమణం చేస్తున్నారు.

చీకటిలో కలసి కన్నులు మూస్తున్నారు
ప్రకృతి వికృతి పరిణామముల ప్రభాతారుణ కాంతులు
దాహము నీరు; ఆకలి మన్ను; జ్వలన వాయువుల
కుంభించిన మానవసంతతి యుగాలుగా జీవిస్తారు
చీకటిదాహం;ఆకలి వెన్నెల;ఉదయించిన భానూదయరాగం
ప్రపంచ సృష్టికి అనాదిరూపం-శాస్త్ర సమ్మతం.

# ప సు ల కా ప రీ

అడవికొండల, పసులవెంబడి
తిరుగుచుండే పసులకాపరీ
నీమహోన్నత భావవేదన
దివ్యగానామృతము భవ్యము-
సెలయేటి పర్వుల ఊటకొలనులు భావఝరులు
గ్రీష్మఋతు వర్షమున పగిలే గుండ్లవలె నీగుండె ప్రోతలు
శరదృతువున పలుకు కోయిల రాగమాలిక దివ్యస్మృతులు
శిశిరఋతుపవనాల చిగిర్చినప్రోడులవలె నీనాడులకదలిక
హేమంతము, విరిసిన గులాబితోటలవలె పూచిన మోదుగు
పువ్వుల యడవులు కొండలు వసంత కోకిలారవములు

*ఎండకాలమున*

జమునివలె దున్నపోతునెక్కి సవాల్ చేస్తావు
అధర్ముల దండిస్తానంటావు గుద్దలి చేదాల్చి
గుంటుకలతో దుమ్మురేగేస్తావు.

వానకాలమున

అవుదూడలతో ఆడుకొంటు
యీనిన పెయ్యలకు బంధాలు వేసి
పాలు పితుక్కుంటూ
మేలికాంతలతో సరసాలాడుతావు
పల్లెపాటలు పల్లెవేస్తావు
పంటలే పండిస్తనంటావు
నాగలిని సవరించి వెళుతావు.

శీతాకాలమున

కూతపెట్టగ
గోనెబొంతల ముడుచుకొని
జోలిపెడుతావు
ఆకలేసి చలితో సరసమాడుతు మూల్గుతావు
ధాన్యరాసులను మోసి గరిసెలను నింపేసి
దీపావళి వెలిగిస్తావు
సంక్రాంతిని కలిగిస్తావు
నవధాన్యాల్ వడ్డిస్తావు.

## ఔను

నిజంసుమీ నిజంసుమీ
నీవన్నది నిజంసుమీ-
నిజంసుమీ నిజం నిజం.

లేదువిద్య లేదవిద్య
లేదవిద్య జగత్తులో-

బ్రతుకు సుఖం చదువు సుఖం
కవితసుఖం, సుఖం సుఖం-

మనమంతా యోధులము
మనమంతా సింహములం
ఏనుగులం-

వెనుక తెల్గు ముందువెల్గు
కుడియెడమల తెల్గువెల్గు
మనదే ఒక బ్రతుకోయ్ !

వీరులము శూరులము
ధరిత్రిలోపల శాశ్వత
కర్మయోగ యోధులము-

నిజంసుమీ నిజంసుమీ
నీవన్నది నిజంసుమీ-

బ్రతుకుబాధ చదువువేధ
కవిత రసాత్మకము సుమీ !
లేదు నరకం లేదు వ్యసనం
చేదు, మధురం భావిఫలం........

## అరగడియలో

అరగడియల వరవడిలో
ఆవేదన బాధాకలితా హృదితో
ఊహించలలో మెరసే
భావామల చిత్తముతో వికాసించి విహరించి

ఆరగడియలో........తెరమరుగుల
మనోస్మృతి, అవిస్మృతి, అనర్గళ వినిర్మల నజ్ఞాకృతి
మాటలతో తోటల లోపలి పొదలలో
మొగలిపూల ఘుంఘుమలో
మల్లెపూల మమతలలో
గులాబిరెక్కల సందున ఆవేదన నివేదిస్తు
మరోగడియ
గులాబిసఖి ముఖందరిసి చిగురించిన మూగనవ్వు
శబ్దించే భాషములో విరచించే కావ్యాలో-

వేదనతో
ఆలోచనా హవిస్సులలో
తన్మయముతో ఆశారేఖలగాంచి, కలగాంచి
మరునిముసం
ప్రపంచ జనసందోహపు సందడిలో విలీనమై-

దొంగదొరల నంగనాచితన మూహించి
రగిలిన హృదయావేదన కరుణామతి
రచించుటకు, మందగమన యానముతో
ఎక్కడనో ఆగిపోయి
అక్కడనే వ్రాసి కవిత-

ఆకటితో సలమటిస్తు
చీకటిలో నిద్రించే, నిరుపేదల కడకేగి
వివరిస్తూ వినిపిస్తూ, బాగున్నద! యని మురిసి-
ముద్రణకై ధనములేక బొద్రాళ్లను దర్శించి
అర్థించిన అర్థకూడ అందించని లుబ్ధులతో-

రగుల్కొన్న ఆకలితో అనవరతము నాలోనె
కేకలేసి ఏవేవో ఆకలి పాటలు వ్రాస్తూ
అర్ధరాత్రి వేళలలో నిద్రాసమయంబని యెంచక
బ్రతుకుపైని నిర్ధారణ భ్రమలోడ్చే ఆలోచన
లోలోపల ఊహించే ఆలాపన చెలరేపే
ఆవేదన పద్యాలు, నిర్భాగ్యులకు హృద్యాలు.

## మేడలు

ఆహా! మేడలు
ఎక్కడి వీమేడలు ?
తరతరాల వేదాంతపు
నీతిమార్గ బోధలు !

నిర్మించిన
అంతస్తులు
పరిశుభ్రపు వాడలు
పాలరాతి గోడలు
నిరుపేదల గోడులు ఆహా! మేడలు.

ఆహా! మేడలు
ఎక్కడి వీమేడలు ?
తరతరాల వేదాంతపు
నీతిమార్గ బోధలు !

విలసిల్లిన
వికసించిన
దౌర్భాగ్యపు బ్రతుకులు
కూలివారి పీడలు
నిర్మించిన మేడలు.

ఆహాహా ! మేడలు
ఎక్కడివీ మేడలు ?

యుగయుగాల వేదాంతపు
కొరమాలిన నీతులు
వలమాలిన బోధలు
మర్గుమందు మాటలు
సంపన్నుల మేడలు.

వెలుగులలో వికసించిన
రమణీయపు వాడలు
రతనాల మేడలు
వినుము వినుము వేదాంతపు
నీతిసామ్య బోధలు-
సుఖసామ్యత వేదము
మోక్షమార్గ స్వర్గము
ఆనందపు వెల్గులు
సైయాటల చిందులు
రుచికరమగు విందులు
భవ్యమతుల ధ్యానస్సులు.

# లుబ్ధులు

పోనౌనులే లుబ్ధుల డెందములు
రగిలే చితాగ్ని గుండములు
వజ్రమంటపమున రత్నఖచిత సింహాసనము నధిష్ఠించిన
వారిగుండెలు నల్లసర్ప గుండులు !

పోనౌనులే లుబ్ధుల చూపులు
విషజర్జరిత కరుణాన్విత రససంపోహపు వాపోతలు !
మొసలికన్నీటి జాలులు
నిరుపేదల అణుగార్పులు.

పోనౌనులే లుబ్ధుల ముఖములు
విపద్పద్మ దళాకారములు
విషకుంభపు హిమశృంగసిరములు.

పోనౌనులే లుబ్ధుల హృదయం
తేనెపూసిన కత్తుల సంయుతం.

అంతేలే లుబ్ధుల చేతులు
అగ్నిహోత్రమునకు నేతిధారల మధుపాతము
కుశలజీవిత యజ్ఞవాటి కాపహాతము,
ఉసులవి, శ్మశానవాటికకు.

పోనౌనులే లుబ్ధుల బ్రతుకులు
నవరస రుచికర భోజ్యము దేవుని కరుణాకటాక్షము.
కడుపునొప్పిశూలలు ఆనందపు ఊహలు.

# రా జ రా జా

నాదంటావా ? అంతా
నీదంటావా ?

లుబ్ధాగ్రేసర చక్రవర్తీ !
ఇవనంటావా ! ఓ హెూ ! ఏమంటావు ?
సక్రమ వ్యాపార పరాయణు ! నారాయణ జపతీ !
చొక్క శుద్ధిలేని నవాబూ !
భోషాణాలలో నింపిన స్వర్ణ ఇటుకలు.

నాదంటావా ? అంతా
నీదంటావా ?

రైతు పొలము నిర్మాణానికి
రామరాజ్య నిర్వహణానికి
శ్రామిక జనసందోహానికి
శాస్త్రవిజ్ఞాన కళాశాలలకు
ఇవనంటావా ! ఓ హెూ ! ఏమంటావు ?

డబ్బులేదు మావద్ద భరించలేము కష్టం
ధర్మం దానం చెయ్యి
శ్రమజీవులకు ఆసరాచూపించి కీర్తి నిలుపుకో
సామ్యవాద సిద్ధాంతపు శాంతి సత్యసముదాయపు
కేతనముల గాంధేయపు రామరాజ్య పరిషత్తుకు
సానుకూలమయి పోవా !
నాదంటావా ? అంతా
నీదంటావా ? ఓ హెూ ! నవాబూ ఏమంటావు ?

ఊహించు కుంటావా ? ఊహించుకో !
నాడు మాదిమీది
నేడు మీదిమాది అని
రైతులంటున్నారు, కవులంటున్నారు.

## నా గొడవ

కాసులకొరకు, మోసం జేయకపోయినా
మీసాలకు రంగులు పూసి
వేసం సెబాసనుకొని నప్పుడు
బాసలకు విలువెక్కుడుంటుంది సంతోషించినా.

అక్షరం అక్షరం గనుక
అందరు పుస్తకాలే వ్రాయడం
ఆనందపడడం సహజం.
భావం అహంభావానికి
స్వాహాజేసి నప్పటికి
షరంలేని బ్రతుకు
సజావుగానే సాగుతుందిప్పటికి.

యౌవనం శక్తివంతమైనటువంటి
భావావేదన కవిత్వం కాదనినా
ముసలితనం బండిబరువు ఒడలు పెంపు
పనికిమాలినదైనా
పసచాలని భావశక్తి శబ్దాడంబరమే
మహాకావ్య మనుపించునా ?

ఏదియేమైనా
రేపేమౌనో
అనుక్షణం
మృత్యువునకు ఆహూతం నాప్రాణం.

కనుక నాకు తోచినవిషయం
కవిత్వముగాక ప్రజల కుపకరిస్తే
నా గొడవకదే ధన్యత్వం—

## పసులకాపరి విషాదం

బ్రతుకుకోసం వెతల నెరగని
గాసంకోసం బ్రతుకుటాసల
తల్లికటిన చద్దిమూటను పదిలపరచుక
పడిలో నూకలు బుక్కుకుంటూ
పసులవెంబడి అడవికేగిన పసులకాపరికి-

గగనమంతా చిమ్మచీకటి క్రమ్ముకొచ్చి
మబ్బుపటీ హోరుగాలులు వీచి వర్షం
కురుస్తుంటే ఉరుముతుంటె ఛర్రుమని వేమెరుస్తుంటె
దారిలేక దాపులేకా అడవితిరిగే పసుల కాపరి కెంతబాధ ?

పిడుగుబడ్డితె పసులు పర్గులెత్తితె
ఎక్కడని ఏదిక్కు వెదకుచు పారిపోవును దారిగనక
గొడుగులేకా గూడులేకా ఏడురోజులు ఒక్కతీరుగ
గగనమంతా చిల్లులుంబడ కుంభవర్షం కురుస్తుంటె

కప్పుకొనుటకు బొంతలేక కాచుకొనుటకు నిప్పులేక
చల్లగాలి వీస్తుంటె అడవికెళ్లిన పసులకాపరి కెంతబాధ ?

ఇంటికాడ కొడుకురాకకు, తల్లియుల్లము తల్లడిల్లి
వెక్కివెక్కెడుస్తు నిప్పులగ్రక్కు నిట్టూర్పులతొ కన్నులు
చూపులో కావిరులు గ్రమ్మగ ఆవిరులవలె లేచిపోయె-
అశ్రుకణములు, తల్లడిల్లే గుండెచప్పుడు
పాడుఊహల పెల్లగిల్లే తల్లిహృదయం
కరగినీరై వరగిపోయిన శిలలపోలిక
కడుపులో పేగులు జ్వలింపగ
నెత్తికొట్టుక యేడ్చుచుండే
పసులకాపరి తల్లిబాధ యెంతయున్నది ?
పలవరించే తల్లిహృదయము పోల్చుకొనుటకు
కవితచాలదు సాశ్రువులు చిందించగలము—

అడవిలో ఘూర్ణిల్లె సింహాల్
గర్రుమనె బెబ్బులుల మ్రోతలు
ఘీంకరించే మత్తగజములు అడవిపందులు
వాడికొమ్ముల లేడి గంతులు
నక్కకూతలు మిన్నుపగలేటట్టు అరపుల
నిద్రపట్టక వణుకుచుంటూ అయ్యోదేవా
అయ్యోరామా ! యంచారటిస్తూ-

నాగుబాముల వాడిచూపుల
పేగులన్ని కదలిపోయే బాధలందుచు
అడవినుండే పసులకాపరి కెంతబాధ ?

# మరో ప్రపంచం

మరో ప్రపంచం యిదే ప్రపంచం
ఇదే ప్రపంచం మరో ప్రపంచం
మరో ప్రపంచం స్వర్గసీమయని
మరపించే వేదాంతుల్లారా!

ఇదే ప్రపంచం స్వర్గసీమయని
మరపించండోయ్ మహాత్ములారా!
దేవుని వెలిపెడు దివ్యమానవుని
దేవుడెయని మది పొగడండోయ్.

మరో ప్రపంచం మహాత్మ్య మానవులు
ఇదే ప్రపంచము ఘనమనిరోయ్!

చూచేదంతయు శూన్యంబైనా!
చూడనిదంతయు శూన్యంబేరా!
చూచేదంతయు చోద్యంబని మది
ఇదే ప్రపంచము ఘనమనుడోయ్
మరో ప్రపంచమె యిదియనుడోయ్!

ఆలోచించగ ఆలోచించగ
అంతా ప్రపంచమే
ప్రపంచమంతా మరో ప్రపంచం.

సగార ప్రమోగించోయ్! ఛళియని
మృదంగ మేగించోయ్!

చూడగచూడగ గుఱ్ఱముగాడ్దౌ
గాడ్దెల దాకరు ఘనులెవరైనా
సవారిజేయుడు గుఱ్ఱమునెక్కి
ఎవారుగాని ప్రపంచయాత్రన్-

ప్రపంచయోధులు ప్రపంచమంతా
ప్రవాహఝరులై పరుగెత్తాలోయ్-

ప్రవాహఝరులై ప్రపంచమంతా
పాడిపంటలే పండించాలోయ్-

దేవుని జూపును ఈ వేదాంతం
స్వర్గముజూపును ఈవేదాంతం
ఇదే ప్రపంచం మరోప్రపంచం
మరోప్రపంచం ఇదే ప్రపంచం !

## వ్యాత్యాసం సోదరా!

దండతాడిత భుజంగాలు మీరైతె
శాంతి మనోవల్మీకాలము' మేము-

ఎగిసే లోహవిహంగాలు మీరైతె
అహింసాకృత శస్త్రహస్తులము మేము-

కెరలించెడి మౌనమృదంగాలు మీరైతె
సత్యామృత ప్రవాహఘోషలము మేము-

జగన్నాథ రథచక్రాల్ మీరైతే
ధర్మనిష్ఠా కలితాత్ములమై యెక్కి ప్రయాణము
చేస్తాము మేము-
మంత్రనగరి సరిహద్దుల దీపాంగనలు మీరైతే
హృదయామృత కిరణులమై ఉదయిస్తాం మేము!

## బుక్కలు

అగ్గిసెగలు పిచ్చికుక్క
గబ్బువస్తువును
హీనంగాచూడు, దేన్ని
ఆరోగ్యమేనని రచనాత్మకముచేయుకు-

ఇంటికుక్క
పెరటిచెట్టు
తలుపుగూడు
నీవైపె చూస్తుంటాయి
తమను గుర్తించమంటాయి-

ఆవుతగులు
మట్టిముంత పగిలినచిప్ప
వెర్రితల్లి
కవికి కళామయం-

నిజం నిజం శిల లనర్థం
ఎందుకోయ్ కవితావేశం

కానరాని పిచ్చివేషం
కడుపునిండగా బేరసారం
రెక్కలుంటె కష్టంచేసి
బుద్ధుంటె నోరుమూసుకొని
ప్రపంచమొక పరమార్ధమ్మని
పడిమూల్గితె పరమానందం.

## ముక్కులేని వేదాంతం

శూన్యమా యీభూమి ! ఐతె
శూన్యమెన్నడు సున్నగాదోయ్ !

భూమియే స్వర్గమ్ము జూపెను
భూమియే వర్షమ్ము గురిసెను
భూమియే లోకాల పెంచెను
భూమియే త్రేతాగ్ను లురిమెను-

భూమియే సకలార్ధమై గన
మాతయైనది మృత్యువైనది
భూమిలో గలదోయి స్వర్గం
భూమిలో గలడోయి దేవుడు
భూమిలో గలదోయి సత్యం-

ముక్కులేని మూఢులకు నా
మొండి వేదాంతమే గురుత్వము
ప్రళయకాలము వచ్చిపోయిన
మరలభూమియె లోకమౌనోయ్ !

లోకమే శాశ్వతము సుమ్మీ
లోకమే సర్వేశు సుమ్మీ
ఇదియె నావేదాంతమోయ్
ఇదియె నాకల్పాంతమోయ్
ఈ ప్రపంచమే ఘనము ఘనము.

## త్రిశూల జోస్యము

త్రిశూల జోస్యం ప్రపంచశాంతికి
త్రివర్ణరూపం త్రివర్ణకేతన
మెగురేస్తామోయ్
ఎగురేస్తామోయ్ !

త్రిగుణమార్గములె ప్రపంచవిధియని
త్రికాలాలలో త్రిలోకాలలో
ముక్త కంఠముల ప్రమోయిస్తామోయ్
ఫలానుభూతిని కలిగిస్తామోయ్ !

పచ్చనిపంటలు పాడియావులు
తెల్లని వెలుగుల బ్రహ్మతేజం
పల్లవించిన గులాబిరేక
బ్రహ్మవిష్ణు ఈశ్వర త్రిమూర్తులస
ప్రపంచధర్మము పరిపాలిస్తాం-
ఘనవేదమ్మని మారనిసత్యం
ముక్త కంఠముల మ్రోగిస్తాం-

పచ్చనిపంటా ప్రభాత తేజము
రెండులేక యీగులాబి లేదని
వేరొక పతాక మెల్లెగురేస్తార్
లోకములేదనె రూపమునెరపే
సిద్ధాంతాలెటు చిగురించునురా !

మృత్యుముఖమున మూల్గినలోకం
మూడుగతులతో ముప్విధములతో
త్రివర్ణ పతాక త్రిలోకమేలును
రాకాసులతో రాజ్యాల్ మారిన
త్రివరరూపం తీసేదెట్టుల ?
ప్రభాత కిరణోద్వేగరూపమున
సప్తహయోత్తేజో వేగమున
దాస్యరాక్షసిని తరిమేశామోయ్!

స్వతంత్ర విప్లవ శంఖనినాదం
ఉష్ణరక్త దివ్యోత్తేజమున
శ్వేత గజేంద్రుల స్త్వైర విహారం
సింహ పరాక్రమ గరనఘోషల
సామ్రాజ్యాలను స్వాహాజేసి—

గద్దెలు కదలీ గజగజలాడగ
భీకర రాక్షస "బ్రిటిష్" పాలన
శాంత్యాయుధమున అంతముజేసిన
మహాత్మగాంధీ మహామంత్రము
భారతజాతికి తీరనిసంపద
సత్యాహింసలు శాంతి పదములు

బుద్ధదేవుని సిద్ధాంతములె
అశోకచక్రపు ఆకారంబని
గాంధిమహాత్ముని సందేశముతో
ప్రపంచమంతా నడుములుకట్టి
పరిభ్రమింపగ పరిభ్రమించి
ప్రవాహఝరులై పరుగెత్తామోయ్ !

కృష్ణపక్ష వేగమే ఈలోకం
గాంధీరూపం కృష్ణవికాసం
చక్రధారియై గాంధీదేవుడు
ప్రపంచవేణువు నూదాడోయ్ !
ముల్లోకములే కదలినవోయ్ !
త్రివర్ణకేతన మెగిరిందోయ్ !
ధనంజయులులా స్వతంత్రవీరులు
భీమపరాక్రమ విక్రమమెనసి
దాస్యరాక్షసిని ధ్వంసముజేసి
ప్రజారాజ్యమును స్థాపించామోయ్ !
ప్రజలు రాజులని సాటించామోయ్ !

ఎంగిలికూళ్లో కొంగజపాల
కోతిమూకలను తరిమేశామోయ్ !

మర్మములేని మారని సత్యం
సోషలిస్టు స్థిరసామ్రాజ్యం
ప్రపంచమంతా ప్రకాశింపగా
పంచశీలసూత్ర ప్రణాళికలు

పంచవర్ష భావప్లుతమయ్యీ
ప్రపంచశాంతి ప్రదీపింపగా
ఆలోచించుడు నాయకులంతా-

తుంగతరంగ తురంగ వేగమున
భయమును బాసిన భక్తశీలురై
ఉదయోన్ముఖులై ఉత్తేజముతో
పదండి ముందుకు పదండి త్రోసుక
మరోప్రపంచము మరచేపొందని
మహాప్రపంచమె మహాప్రపంచమని
శంఖారావం ఢంకాధ్వానం—

విప్లవస్వరాలు వినుతించాయని
విప్లవ శంఖం వినుపించండోయ్ !
మూడుస్థితులుగా మూడుగతులుగ
ముక్తకంఠమున త్రిశూలజోస్యం
ప్రపంచజనులకు పాఠాల్ నేర్పుడు
సింహావలోకనము చేయండోయ్ !

హిమాలయాలు యెగిరి యెగిరి యీ
ప్రపంచమునబడి బ్రద్దలుజేసిన
జంకని అప్రతిహత శక్తులతో
ప్రపంచవేదిక నధిష్ఠింతుమని
ప్రపంచపాలన పరిపాలిస్తాం !

శాంతిరూపమే, సుప్తభుజంగాలు
సుప్తభుజంగాలు శాంతి నెరపెను-

ఉష్ణరక్త కాసారోద్విగ్నత
సత్యాహింసల మసలే మంటలు-
సంక్షోభించి స్వరాజ్యలక్ష్మిని
అశ్రుతర్పణముల పూజించామోయ్ !

నయాగరా శివతాండవమేల ?
భయము, భక్తి, మా ముక్తిత్వం !
హోమజ్వాలల భుగభుగలేలా ?
మామకమానస ధగధగలు !
త్రివర్ణపతాక నిగ నిగలు !

అగ్నికిరీటపు ధగ ధగలేలా ?
బుద్ధితీక్ష్ణత సెగలెగయు
కనపడలేదా మహాప్రపంచము
స్ఫురద్రూప విన్యాసహాసము
రామనామ సంకీర్తనము.

మహాప్రపంచపు మహాత్మ్యము
దారిపొడుగునా పందిళ్లే
ఆటలపాటల పెండ్లిళ్లే
బాలురు యువకులు వృద్ధులు సిద్ధులు
బాలలు యువతులు సిద్ధాంగనలు
మహాప్రపంచము మర్త్యప్రపంచము
ఇదేలోకమని పలుకండోయ్ !

శాంతికపోత విహంగములై యీ
ధరిత్రినిండా యెగురండోయ్ !

శాంతిపాఠముల పఠించుడోయ్
కనపడలేదా మహాప్రపంచము!

సత్య శాంత్యహింసా త్రేతాగ్నులు
ఎగిరి ఎగిరి ఈ భూమిని వ్రాలి
ఎనభైలక్షల ఖగ సంతతులు
చీకటి రక్కసిమూకల రక్తం
చించి చించి త్రాగేస్తాయోయ్!

విలవిలమండే మంటకాదది
జోలబాడు సంగీతార్ణవము
రామగానము శాంతివేదము
మహాప్రపంచపు మానవసృష్టి.

నయాగరావలె భయావహులమై
శాంతివేదమును సృష్టిస్తామోయ్!
నిశీధరాక్షసి విశీర్ణమవగ
ప్రపంచధర్మము పరిపాలిస్తామ్!

## రాచకీయపు కవిత

రామ శివులు గాలిపోయితె
మహమదల్లా మన్నుయైతే
ఏసుక్రీస్తు మిన్నుయెగసితె
బుద్ధినీతులు బూదియైతే-
రాచకీయపు కవిత నాడు
రాణకెక్కును లోకమందున-

మతములన్నీ మాయమయితె
కులములన్నీ కూలిపోతే
వర్గభేదం వరగిపోతె
జాతివైరం సమసిపోతే
చిన్నపెద్దలు సున్నయైతె
రాచకీయపు కవితనాడోయి
రాణకెక్కను లోకమందున-

ఈ ప్రపంచము కాలిపోతె
లోకమంతయు లేకపోతే
వెల్గునీడలు వెల్లనైతె
తార తళతళ లాడకుంటే
రాచకీయపు కవిత నాడు
రాణకెక్కను లోకమందున.

తార మాయము కాదుకాదోయ్
వెలుగునీడలు పోనెపోవోయ్
ఈ ప్రపంచము కాలిపోదోయ్
లోకమంతయు లేకపోదోయ్ !

లోకమంతయు ఉన్ననాడె
రామశివులు గాలిపోరు-
మహమదల్లా మన్నుగాడు
ఏసుక్రీస్తు మిన్నుఎగయడు
బుద్ధనీతులు బూదిగావు
మతము లెవ్వడు హతము జేయడు

కులము నెవ్వడు కూల్పజాలడు
వర్ణభేదం ఒరిగిపోదు
జాతిభేదం సమసిపోదు
చిన్నపెద్దలు సున్నగారు
రాచకీయపు కవిత చదవరు
రాణకెక్కదు లోకమందున !

రాచకీయపు కవిత జోలికి
పోక ధర్మపు బోధలల్లెడు
వాడె కవియై లోకమందున
వాసిగాంచును యుగయుగమ్ముల
పరమ సత్యం
పరము నిత్యం
అనండి !

ఒకరి నొకరు మ్రింగివేసే
రాక్షసత్వం సమసిపోవలె
తాను యెవడో పరుడు అతడని
ధర్మమెరిగిన నదియె సత్యం
సత్యమే కవితాజవమ్ము
సత్యమే జీవామృతమ్ము
సత్యబోధల సల్పువాడిల
నిత్యమై కీర్తించు ధృవమై
నిత్యమై కీర్తించు ధృవమిది.

# కవులు-రైతులు

కలము కవిదే
హలము రైతుది.
కలము కవిదై వ్రాయు కావ్యాల్
హలము రైతుది పొలము దున్నును.

హలము కలము
కలము హలము
రెండుసాగిన జగతి పండుగ
రెండు భూమిని దండినిల్పును
ఓహెూ రైతా! దున్నరా నీ దొడ్డక్షేత్రాల్
ఓహెూ కవీ! వ్రాయరా నీ గొప్పకావ్యాల్.

మరకతమ్ములు పండునోయ్
భావమణులు విరియునోయ్
కలము హలమై సాగునాడే
కావ్యమై శాశ్వతము నింపును.
పోతనయె ఈ నీతి గరపెను
భాగవతమై భక్తిగూర్చెను
భక్తియే భుక్తికి పునాది
భుక్తియే ముక్తికి సమీపం
ముక్తి జీవన్ముక్తియౌనోయ్.
ముక్తి లక్ష్యము జీవకోటికి
తెలసి సత్యము పలుకువారికి.

# మహాప్రస్థానము

దేహి దేహములతో దీపించు మానవులు
దేవు డొక్కడటంచు దివ్యముగ జాటండి
దేవు డాకార శూన్యుడు భావుకుల మదిని
శూన్యమే సున్నగా చూపించు లోకాల
శూన్యమంతను దాగి చూచుచున్నాడోయ్!

దీని కెవడు ఖరీదు కట్టనున్నాడు
దాని గోప్యము దెలియు మానవులు లేరు
సున్న యెప్పుడుగూడ శూన్యమైపోదు
సున్నయే భూమియై శోభిల్లినాది
భూమియే సున్నయై భామయైనాది
మిగిలిపోయినదంత రగిలిపోతుంది
మిగిలిపోయినదంత భగవంతుడౌను.

భూమిలో రత్నాలు పారలించ రండీ!
భావుకులునై కవులు భాగించరండీ !
రైతు భూముల దున్ని రాజనాలు పండించు
పాలకులు భూములను పాలింతురండీ !
భాగ్యవంతులు వాని భద్రపరచెదరు
అందరిది ఈవస్తు సముదాయమంత
కడుపుగాల్చుక ఎవడు కష్టపడరాదు.

11)

# సుకవీ! ఓ సుకవీ!!

సుకవీ! ఓ సుకవీ!!
నీ నవమోహన నవగీతిక కరుణారామములో
నిను నేనొక జన్మాష్టమినాడు
అతిమధుర విలాస లాలసమతి
తెరచితి నీ భాగవతము
ఆప్తుడవై కనుపించిన భక్తి సముపేతార్థఖనీ!
ఏదో! ఏదేదో!! నా
డెందములో కదలిందొక మందాకిని
కరుణారస భరితమ్మై.

ప్రసవించిన యశోదేవి
నరకాసుర బాధలతో
ఒరగిన జీవచ్ఛవమై
తపియించితి నీకై నే
జన్మము ధన్యముగాకని
వెదకే డెందుకు వెలుగుల-
పలికితి నీకై నేను
ఎటుచూచిన నీరూపే
కంసాహంకారములో
నీ రూపము చూచుటకై
నే నిహమున జన్మించితి
నా మదిలో హృదిలో చెలరేగిన జ్ఞానమున
ఏకాత్మగ స్మరియించితి నాకై నేను దేవ!

నా ఆత్మశక్తితో తపస్సులుజేసి
చిరదీక్షా వ్రత సంకల్పముల
నిశ్చలబుద్ధితో స్మరియించిన
స్వరమయుడవై తోచిన నా జ్ఞానములో
ఏమానందం, పరమానందం, తోచినరూపం,
నాకై నేనె తమ దివ్యరూప సాక్షాత్కారము
పుండరీక వదనాకృతి-

రచియించిన నా పద్యము గద్యము
ఎంత భక్తివంతమై జీవరసధునియై
ద్రాక్షామధు సంకలనమై ప్రవహించి
ప్రవచించబడెనో ? వినుతించెనో ?
నాకై నే పాడిన నీనామ సంకీర్తనము
అన్నివృత్తములు, పూచిన పూవులు
నింపిన తావులు రాగమాలికలు
వెన్నెలభూమిని విలసిల్లిన
తెమ్మెర లావహించిన
మలయ మారుతామృతము గిలిగింతలు పెట్టిన
అహర్నిశలు ఆనందామృత అనురాగాలు
వేణునాదమయం స్వయం-

ఆ వెన్నెలలో—
వికసించిన పూలతోటలో తన్మయత్వముస
చిలుకా, కోకిల, పలికిన, పాటలు,

నా అంతర్వాణికి రాధికా స్వప్నము
మెయి విరుపులు ప్రణవ విలాసం.

ఎంతో అమరత్వము శ్రీకృష్ణకథామృతము
రాధికా రూప విలాసము-
మనస్సులో తలచుకుంటె
అగుపించే శ్రీకృష్ణులు
వినుపించే వేణునాదం
తామరకొలనిలో పూచిన కమలం
చకోరకామిత మధుర విహారం-
ప్రేమతో శాంతం ప్రఫుల్లవదనం.

ఇంకా రాడాయె కృష్ణుడు—
నిద్దుర ప్రొద్దయ్యెనని
విరహవేదనా విహ్వల చిత్తులునై
సుఖ స్వప్నావళి విరిడోలికలలో
ప్రణవ స్వరూపం చిత్తాయత్తం
క్రొవ్వొలపులు పూచినహాస్యం

ప్రేమ మంటపమున—
మన్మథ మారుతాయానము
విసుగు కునుకు నిట్టూర్పులలో
ముకుళించిన పద్మనయన !
మనసుపట్టి పిలచిన చప్పుడు
ఆనందాశ్రుల నిరీక్షణలు

ఎటుదోచని ఎటుకదలని
వంశీరవ మోహన గీతాలాపం
నాదామృతము చిత్త మన్యాయత్తము-

ప్రేమకలాపం—
విరహతప్త ప్రాణములతో
ఇంద్రలోక సురవైభవములతో
ఆశా నిరీక్షణల
తన్మయానంద సందోహ ప్రణయము
బాపని రాయబార వృత్తాంతము
రాధికా హృదయ కమల సంచలనము
ప్రేమారాగం అమృతం ఆనందం
పరుగెత్తే ప్రణయోహలు—

ఊహాంచలముల పలికే రాగ ప్రేమ
మధురానందం తెల్లని వెన్నెల
మనోభ్రమ ఆశారేఖలు
ఒకకోటి వేణునాదాలు-

ఒకశంఖ ప్రణవ ప్రహసనాలు
అనంతమయ లావణ్యాలు
.కన్నానయ్యా! కన్నా! ఎన్నోవిన్నాను
ఆ విన్నవి కన్నవి చెప్పాలంటె
ఎన్ని నిఘంటువులైనా సరిపోవు.

సుకవీ! ఓ సుకవీ!!
అమోఘామోఘ శాస్త్రధర్మముల పాటించి
వ్యాకరణ ఛందస్సుల నిబంధనల స్పందించి
ద్రాక్షపండ్లుగా మామిడిపండ్లుగా
పద్యాలు గద్యాలు వ్రాసినావు
తన్మయానందము జెందినావు
ఆ ప్రవహించిన భక్తి స్రవంతి
రమణీయము!
విద్యుద్దీపప్లుతశోభావళి
నానా భావాలతో తన్మయానందము జెంది
నా గిలిగింతల ఊహలలో
నిశ్చేష్టత కల్గించిన నీ భక్తి పారవశ్యత
ఆనంద సందోహ మందానిలము-

ఉయ్యాల లూగించి
దశేంద్రియముల మరపించిన పరమార్థము
ఏది పద్యమో ఏది గద్యమో ?
ఊహింపకరాక
ఊపిరి మరొకదిక్కు మలపక
నిషా తృష్ణా సమాధిలో
నాప్రాణం, ప్రణవ సంకలితమె
మంత్రించిన నీ భాగవతము, ప్రవచించిన
బ్రహ్మత్వం, జ్ఞానాకాశ విహారానందం.

పుట్టిన ఈ పాపమతికి—
నా నరాల వీణాతంత్రుల మ్రోయించిన
వేణుగాన విలోలామృతము
జీవన్ముక్తి కలకాలంబు
నీ పద్యపద్యము గద్యగద్యము
విశుద్ధ ద్రాక్షారస కలితం
ధన్యజీవికి పరమానందామృత పరిరంభమవు-

ఉపశమిత సుఖదుఃఖ ద్వంద్వద్విజ! విజయ!
వేదపాఠ విదుడవు
చింత్యాచింత్యామోఘ సుధారస రచనా
యత్త చిత్తైకాగ్రతనిష్ఠుండవు
క్షణిక వ్యామోహత్యక్తారీ!
శాశ్వత భగవన్నామ సుధారస కథా సంకీర్తన
కీర్తిధారీ! భక్తిరస పిపాసీ!
బ్రహ్మానందము నందించిన నీ వైరాగ్య తపో
నిష్ఠ లోకానందం అమితానందం
పరమానందం, కవితామధురం రమణీయాకృత
శబ్దాలంకార భరితం-

సుకవీ! ఓ సుకవీ!!
శ్రీశైల మహేశ్వర ద్రాక్షారామములో విలసిల్లిన
నీ భాగవతము
ఏకైక మహేంద్రోర్వికి సువర్ణ కర్పూర దివ్య
పుష్పాంజలి-

బ్రహ్మ విష్ణు మహేశ్వర
పరికల్పిత కల్పతరువు.

తుంగభద్ర గోదావరి కృష్ణానదీ పవిత్రజల
సందోహము
ముక్కోటిన్నర తెల్గుల ముక్తమంటప నిర్మాణము
ఐహికాముష్మిక ధర్మమార్గ నిరంతర ప్రదర్శకమై
తెల్గుదేశ గౌరవ సౌరభ దివ్యజ్యోతిగ
వెలసిన నీ భాగవతము విద్దెల వేల్పు
భవహరమగునటు బల్కిన తవనీయాత్మ
ప్రభావం రామచంద్రమూర్తి మయమా ?

భాగవతము——ఓహెూ ! పోతన కవీంద్రా !
ఏడీ ? నీవలె పలికిన భక్తిభావ తన్మయుడు
మహా కవీశ్వరుడు ?
పునర్జన్మ లేకుండగ జన్మ సఫలమయ్యెనుగా !
నిను వలచియె నిలచి పలికె పలుకులవెలది
నీ నోటను-

నే నీ లోకములో—
తిండిపోతునై అహంకారముతో తిరుగుతున్న
నా యీ మూర్ఖపు బుద్ధికి
ఆనందము గావించిన మీభక్తి
నా బహిః కామక్రోధ లోభమోహ
నాశనము జేసి.

ప్రేమ శాంతి సత్య
ధర్మముల భక్తిని పురికొల్పిన
నీరచనా విశిష్టత-

నా జీవితమున
సుఖదుఃఖముల నెడబాపి
భక్తిని చేకూర్చి, ప్రపంచములో
నన్నొక మనిషినిజేసి, తెలియనితనాన్ని
రూపుమాపి చెడుమార్గముబట్టించక
జ్ఞానాన్ని గరపి-
భక్తిభావముల ననుదనపిన నీ కవితా
మాహాత్మ్యము

లలిత లలిత పదయుత కరుణాన్విత కథామృ
తాయత కవితా !
సుకవితా ! సుజనహితా ! భక్తసుతా ! దైవస్తుతా !
సదయా ! సహృదయా ! సమతామతీ !
ఇదో ! నా ప్రేమాంజలి-
ఎదపూచిన కుసుమాంజలి..

రచనాకృతి స్మరిస్తాను
ఏదో పిచ్చిగ రాస్తే లోకముమెచ్చదు-
భక్తి రసములేని కవిత బండలకే రుచిపుట్టును
నీ కీర్తినింప యీగీతం నిత్యవచనంగా
స్మరించుటకు నాహృదయోద్వేగాలాపన

కవితాకృతి కావించితి.
ఈ లోకములో
మీ కావ్యము చాలాకాలము నిల్చును
అందులకై
మీ కీర్తిని దిగ్దిగంతముల జాటాలని
నా కలమును కదలించాను.

ఎవరు వ్రాయగలరు మీయంత భాగవతము ?
తెల్గు లోకాలకెల్ల వెల్గును జూపిన జ్ఞానాత్మవు !
మీ భక్త్యుద్వేగ ప్రవాహము—
జ్ఞాన బీజావృతమై తెలుగు పొలాల పండించినది.
మా చిత్తానందము——గలిగించిన నీ
వచనము నీ రచనము మధుర రసకలితము
సుధామయ సూక్తి విలాసము !

రాగుల అంబలిద్రాగి యేరోగములేకుండా
దైవ కృపారక్తుడవై వ్రాసిన నీ భాగవతము
నడిపించినది నాగలియా !
కదలించినది ఘంటమా !
అరగి జీర్ణమై పోలేదో ?
హలము కలము నడపిన ధీ
శాలివి ఓ పోతన్నా !

పొలము బండు రాగులతో
కాలమెట్లు గడపితివో ?
నరాంకితము చేయని జ్ఞాని

రామాంకితమై పోతివా!
సకలాంధ్రము కేంద్రమ్ముగ సల్పదె నీనామస్మృతి
సుకవీ! ఓ సుకవీ!! ఓ సుకవీ!!!
నా సంకీర్తన సుకవీస్తుతి
జగత్తునకు చెరగని స్థితి

"బాల రసాల సాల (నీ) నవపల్లవ కోమల కావ్య
కన్యకను
కూళల కమ్మక అప్పుడుపుకూడు భుజింపక
సత్కవులైనవారు"

హాలికులై, బ్రతుకుట దోషముగాదని, కందమూలాదుల దిని భార్య బిడ్డలు గల గృహస్థులు గూడ బ్రతుక వచ్చునని ఏనాడో చాటిన నీ పరమ సత్యానుభూతి ప్రపంచ పరివ్యాప్తమై, సకలజన మనోరంజకమై లోకాలను తలక్రిందులు జేసిన నీ అకుంఠిత భక్తి ప్రవాహామృతము ఎల్లమానవకోటికి నివేదనమై సంతృప్తి పరచెనుగదా!

ఓ సుకవీ! నినుగూర్చి దాశరథి ఎంత ఆనందపడెనో తెలియజాలను మహాకవీ! మీభక్తి మాహాత్మ్యము మాలో గలిగించుటకై నీవలెనె నేనా దాశరథిని వేడుకుంటాను.

మీ అమరాత్మకు శాంతి శాంతి! ముక్కోటిన్నర తెల్గుల విచార విహ్వల చిత్తము పోతన భక్త్యాయత్తము. అమరాత్మకు శాంతి గూర్చు శ్రద్ధాంజలి విశుద్ధాంజలి అందుకో సుకవీ! ఓ సుకవీ!

నా ప్రేమాంజలి.........

# మహా ప్రపంచం

మరో ప్రపంచము మహా ప్రపంచము
మహా ప్రపంచము మరో ప్రపంచము
మరో ప్రపంచమె మహా ప్రపంచము
మహా ప్రపంచమె మరో ప్రపంచము.

మతిచెడిపోయిన మానవులారా!
మహా ప్రపంచమె గతియనుడీ!
మహా ప్రపంచమె గతియనకుండిన
మరో ప్రపంచమె చూస్తారు.

మరో ప్రపంచపు స్వర్గసీమలో
హాయిగ కన్నులు మూస్తారు
ముసలోళ్లంతా చూస్తారు
చచ్చేవాళ్లు చూస్తారు
మహీ ప్రపంచమె మనదనువారు
మహా ప్రపంచము చూస్తారు.

మహత్వమంతా చూస్తారు
మహాపర్వమని మసలెదరు
మహాయోధులై మహావీరులై
మహాత్యాగులై మహాభోగులై
మహారాజులై మహాకవులునై
మహాదాతలై మనియెదరు.

మరోప్రపంచపు మహాగ్ని కణములు
ఆటంబాంబులు నిర్మిస్తారు
ఆటంబాంబుల ఆయుర్దానము
మృత్యుశాంతిలో పాదిగేస్తారు
శాంతి విప్లవము సాగిస్తారు
ప్రపంచశాంతిని ప్రకటిస్తారు.

మరోప్రపంచపు దారుల మలచీ
ఆటంబాంబుల వెలిగిస్తారు.
ఖూటకవాదము
ప్రపంచశాంతిని వెలయిస్తారు
యుగాభ్యుదయమును సాధిస్తారు

ఇదే ప్రపంచ నినాదము నాది
మరోప్రపంచ మహత్వ సమాధి
మహాప్రపంచ మహత్వ మనాది
ఇది తెలియండోయ్
ఇది తెలియండోయ్ !

# మిన్నులన్ని శూన్యం

మిన్నులన్నీ శూన్యమైతె
మన్నునే మనియుండుడోయ్
మన్నులో గలవోయి మిన్నులు
మన్నులో బంగారు గలదోయ్ !
మన్నులో రత్నాలు గలవోయ్ !

చింతజేసెదు వేలకో
సర్వాంతరము నిండినది శూన్యము
క్రాగిపోయిన కాలకర్మము
కలసి నీటిని యూడి పాడదె?
స్వర్గమంతా ఈ ప్రపంచమె
నాకముల జోలెత్త బోకోయ్!

మన్నులో గలవోయి మంటలు
మంటలను జల్లార్పువానలు
ఎండ వానలు కురువకున్నను
మన్నులో బంగారు పండదు.

అగ్నిహోత్రము ఈ ప్రపంచము
మబ్బులే వర్షాలు గురియును
మబ్బులో గలదోయి మాయ
మబ్బులో గలదోయి లోకం.

వెఱ్రి వేదాంతంబు జదివిన
బుఱ్రలే వేడెత్తునంతె-

రైతురాముని దీప్రపంచము
రైతురాముడె రాజరాజోయ్!
రైతు రాజ్యాంగంబె రైతులు
రైతుదేవుడు రైతురాముడు
గద్దరింఢ్రకు గద్దెలేదోయ్!
మొద్దుదొరల మాటకాదోయ్!

నేను జదివిన శాస్త్రమింతే
నేను రాసెడు కవిత యింతే.

# సందేశము

మ. ఇది సర్వేశుని నైజమీ ప్రకృతి ఊహింపన్ ధరిత్రీసతీ
పదునారేండ్ల పవిత్రయౌవనలతా ప్రావిర్భవించున్ రతీ
వదనాబ్జమ్ముల, శారికామధుర వాక్ప్రాబల్య సందోహయై
మదనారావము జిందు తుమ్మెద పతీ ప్రాశస్త్యముంజాటగన్.

మతి చెడిపోయిన మానవులారా!
సుతి మతి గతి గనరో
సతతము మతి మాన్యతమని యిలలో
స్థితిగని మనవలెరా! ప్రపంచం
సతమని మతమనరో!

సతాము, యిల సతి పతియై మెల్గును
మతాము లివె యనరా!
'మతి' మతమయ్యెను 'సతి'పతి సతమూ
గతియింతే గనరా! జగత్తని
మతి మాన్యత మనరా!

యుగ యుగాలుగా జగ జగాలుగా
ధగ ద్ధగల నెగడీ, యిభ్భువి
దగాపడెను రవి యుగ యుగాలుగా
నిగాజేసి కనరా! ఇదియే
యుగాభ్యుదయమనరా!

మతి మాన్యుడవై గతి దెలియుమురా !
సతమని నమ్ముమురా !
వెతకేదెందుకు చీకటి సందుల
సతిపతియై మనరా ! ఇది స
మ్మతమని పల్కుమురా !

క్రోధం ద్వేషం తాపం మీకు
బాధ గలుగ జేయు-
నాదం రాగం ప్రేమయె మీకు
మోదదాయకమ్ము- ఇదియే
సాదరమ్ము మనకు
మతిచెడిపోయిన మానవులారా !

## మాయమయం

ఎవరికివారే యమునాతీరే
అంతా రామమయం ఈ జగ
మంతా మాయమయం. ఎ॥

తల్లి కడుపునా తనయుడు బుట్టి
పిల్లను చేకొనెనోయ్ ! ఆ
పిల్లను కన్నది తల్లియెగాదా
ఉలమరయుడింకా, జ్ఞానులు !
తెలసి మనెడు వరుసా, వనితల
గలసి మనెడు బిరుసా ! ఎ॥

తల్లి చెల్లెలై తనరు ప్రపంచం
ధర్మనిష్ఠ గనినా, జ్ఞానులు!
కర్మకాండమేదో యోచింపుడు
మర్మమరసి జడులూ! మూర్ఖులు
తెలియ యత్నపడరూ ఎ॥

వేదాంతంబును వెర్రని వాగెడు
వేద వేద్యులారా! అ
వేదాంతములో 'కొమ్మలధికమై
వెర్రిలేపు నిజమే'- భ్రష్టులు
విధిని తెలియలేరు- నిష్టత
విధినిగాంచ తల్లీ! చెల్లెలు ఎ॥

పడతి భార్యయై పార్వతియగురా!
పతియై పురుషుడు ఈశ్వరుడగురా!
పార్వతీశ్వరుల ప్రపంచ మిదియని
మనుడు సుజనులారా! హితులై
గనుడు విజయులారా! ఎ॥

మాయం మోసం అంతా మన్నే
మన్నే బూడిదరా!
మన్ను బూడిదై పార్వతి, గాలిని
మన్మథు గూడునురా! శివుడే
మన్మథు డని మనరా! పార్వతి
రతియని కనుగొనరా! ఇర్వుర
సతిపతు లని యనరా! లోకం
గతి యింతే గనరా!........ ఎ॥

# పసిపాప

తే. ఏలనో మూగ భావాల జోలిపెట్టు
తనకు తానే కిలకిల నవ్వును అదేమొ ?
కర్మయోగీశ్వరునిగ వినిర్మలాత్మ
గోల యొనరించి పనులెల్ల గూర్చునింట.

ఆరేడు కాలాల పాటెల్ల శ్రమలోడ్చి
మారుమూలల బ్రతుకు మసలు ముసలమ్మలకు
పనిచెప్పు పాపాయి, పనిచెప్పు పాపాయి-
ఇంటిలోగల ధాన్య మిటటు జేయుచు లేనివి
కోరి యిప్పించుకొని పార విసరును నేల.

ఏలనో పాపాయి ! పాలపాయస మన్న
కనువిప్పి చూడకయె మను బుక్కుచుంటాడు,
ఇదియేమి పాపాయి యిటుచేయ వలదన్న
'బాడంత' బొయినట్టు బ్రహ్మండముగ నేడ్చు-
పసిపాపలమునయ్యు పసిబట్టితిమి మన్ను
మన్నులోగల మహత్వంబె స్వర్గం బనియొ ?

మన్నులో నాడవద్దని వేగ కన్నమ్మ
చంకనిడి నెలవంక జూపి, పాయసమన్న
గగన వీధులనాడు కలువరాయని జూచి
పసిపాప భావమ్ము పర్వెత్తె విన్వీధి
తారకల నేగూడి వచ్చెద ననియొ !

కన్నమ్మ మనమటకు కలసి పోదామమ్మ
అనెడు సైగల తల్లి కానంద మెనయించి
మూతి బిగియించి మిన్నుల మోదమాలించు-
అమ్మచంకనె నిలచి యూరాట పడునేదొ ?
చెయ్యెత్తి చూపించు చిరునవ్వు నవ్వుకొను
మ్రింగ నే నన్నమని మిన్ను లెగసెద నను-

తిక్కనాయన మనకు చుక్కలతొ ఆటేమి
నాచంక నిద్రించి నాచంకనే మనుము
సుఖస్వర్గముల నీవు చూతువా గగనమ్ము
అని నేల నాడించు నను గన్నతల్లియే !

తల్లిభూమిని విడచి తనయులగు మనమెల్ల
గగనాల భ్రమలోడ్చి కాంక్షించ వద్దనెడు
పసిపాప కథ దెలసి బాగుగా వర్తింప
భువికన్న మనయమ్మ అన్నమిడి రక్షించు
మన్నురానీ దొడ్డ కన్నమ్మ యనిజాటు
భూమి యాకాశాల ముడిపెట్టు విజ్ఞాని
పసిపాప నీతియే బాగుంది బాగుంది.

# మహాకావ్యమని వినిపిస్తానోయ్ !

చూచేదంతయు చూడక తప్పదు
చూడనిదంతయు చూడనె చూడం-
చూచేదంతయు శూన్యము కాదోయ్ !
చూడనిదంతయు శూన్యమె శూన్యము.

పెంటకుప్పలే ఘనబలమౌనోయ్ !
బూదికుప్పలే భువిపంటలురా !
వర్షధారలే పీయూషములై
హర్షోత్కర మొనరించునురా !

నాగలిబటి రైతులు కండోయ్ !
కర్షకనాదం హర్షము నింపుడు-
కవినై కావ్యాల్ వ్రాస్తానోయ్ !
కలకాలము జీవిస్తానోయ్ !

విఘ్నేశ్వరులై మెక్కేయోధులు
మహానాయకులు కారండోయ్ !
కర్షకవాదం కర్షకనాదం
కరకమోదం హర్షదాయకమని
కలకాలంబిటు చాటే యోధులె
ప్రపంచవేదిక నధిష్ఠింతురోయ్ !

మహానాయకుల ప్రజాబలంబే
కూలీ, రైతూ, కుంటీ, గ్రుడ్డీ
ప్రజాబ్రతుకులే మహానాయకులు
బంధూబలగం భాగ్యం సుమ్మా !
ప్రజలే దేవులు ప్రజలే రాజులు
మహకావ్యమని వినిపిస్తానోయ్ !
మహకవినియై కీర్తిస్తానోయ్ !

# నిజంగానా?

నిజంగానా ? నిజంగానా ?
యుద్ధవేదిక సిద్ధమౌతుందా ?
ఆటంబాంబుల రగిలిస్తారా ?
అఖిలలోకం మాడిపోతుందా ?
శాంతి జగత్తున సమసిపోతుందా ?
నిజంగానా ? నిజంగానా ?

యుద్ధాలకు సిద్ధమౌతున్నాయా దేశాలు ?
శాంత్యహింసా ధర్మాలు జగత్తున
సమసిపోతాయా ?
సోదరత్వం మాసిపోతుందా ?
స్వాతంత్ర్యం సమభావన సమజీవనము
లయిస్తుందా ?

కురులలో తెలి విరుల ముడిచిన
శాంతిదేవత విన్యాస హాసము
జీవన ప్రభాతము
చిమ్మచీకటి కలసిపోతుందా ? అయ్యో !
నిజంగానా ? నిజంగానా ?

# ఎవరు వ్రాసిరి?

ఎవరువ్రాసిరి యీ చరిత్రను ?
ఎవరు పాడిరి యీ పదంబును ?
పలుకవే బంగారు చిలుకా !
పలుకవే నవరసము లొలుకా ! ఎ॥

బానిసత్వపు బాటలందున
వాడిపోయిన ప్రాణులెన్నో ?
కపట నాటక రంగమందున
కాలిపోయిన ఊరులెన్నో ? ఎ॥

కాలవాహిని డోలికలలో
తేలిపోయిన జీవులెన్నో ?
జాలిగుండెలలోని బాధల
జోలిదాగిన శూల లెన్నో ? ఎ॥

క్రూరజన హింసా పథమ్మున
పారు రక్తపు టేరులెన్నో ?
ఘోర బాధల కుమిలిపోయిన
హీరమయ కాపురములెన్నో ? ఎ॥

దున్నురైతుల కున్న భూములు
ఎన్ని యెకరము లన్నియున్న !
భాగ్యవంతుల పేర పట్టాల్
పదిల పరచిన కిత్తలెన్నో ? ఎ॥

హలము బలమున్ గలిగినట్టి
పొలము చాలని రైతు బాధలు
కలము తెలివియు వెలయునట్టి
నిలువ జాలని కవుల బాధలు—— ఎ॥

# నిర్వేదాలు

గుమ్మము ముందరే ఘోషించే యా
భిక్షుకి నాదం ప్రియమగు వేదం-

అమ్మా ! అయ్యా ! ఆర్తారావం
భావం శబ్దం పరిపూర్ణత్వం
వేదాల్ నాల్గును నిర్వేదించే
శోకం దాహం సూచించునురా !

ఎందరెందరో మహానుభావులు
అందరకును వందనములురా !
సత్యమైనది "చావు" మార్గము
చచ్చేవాడికి సత్యము, సత్యము
మృత్యువు ముందిడి ముందుకు సాగుడు.

సత్యము నమ్మిన నిత్యముగాదా !
నిత్య సత్యమే మృత్యువు తల్లి
తల్లి తనయులను తప్పక కాచును-

సత్యము దప్పిన చావు దప్పదని
సత్యము నమ్ముడు జనులారా!
నిత్య సత్యమై నెగడెనురా!

## ఆ క లి మ ం ట లు

ఆకలిమంటలు అనాథ బ్రతుకులు
భూకంపాలు ఘోరు సాగరాల్
వేదన పొగలు బాధల సెగలు
విప్లవ శంఖం వినిపిస్తాయోయ్!
విప్లవ శంఖం వినిపిస్తాయోయ్!

పరిప్లవించే ప్రపంచ దాహం
పరిక్రమించే శ్రామిక వర్గం
రైతు బాధలు మేఘోల్బణము
ప్రపంచ శాంతిని భగ్నపరుస్తాయ్!

చీకటి దాహం ఆకటి వేదన
రగిలే మంటలు పొగలే సెగలు
ప్రపంచ బాధలు అర్ణవ ఘోషలు
జలాశయాలు భానూదయములు.

షడ్రసాలురా! షడృతువులు
చీకటి దాహం ఆకటి వేదన
ప్రపంచ సృష్టికి ప్రసవ వేదనము
నవరస భరితం భవయుత సుగుణం.

రైతు నాగలి శ్రామిక లోకం
ప్రపంచ పాలన పరిపాలిస్తాయ్ !
దాచిన దాగని ధార్మిక సత్యం
మన్నూ మిన్నూ రెండు ఒక్కటై
కన్నుల కగపడు సున్నయుగాదు, శూన్యముగాదు-

శ్రామిక విప్లవ సాధన మార్గాల్
రైతు నాగలి రాట్నపు చక్రము
బలరాములునై రైతులు సాగి
చక్రధారులై కృష్ణులు రేగి
ప్రాణం మానం కాపాడెదరోయ్ !
ప్రపంచ శాంతిని కలిగించెదరోయ్ !

# కన్నీటి చుక్కలు

కన్నీటి చుక్కలే కదలించు లోకాల
హృదినించు బాధాగ్ని యిల తాండవముజేయు
రాజ్యాలు గీజ్యాలు గద్దె సుద్దు లవెల్ల
కథలు కన్నీటి కాల్వల గట్టుకొని పోవె ?

మురిపింప లోకాల ముత్యాల పండించు
కర్షకుల కేవేళ కడుపు కాలగరాదు
కవుల హృదయము రగిలి క్రాగి పోరాదు-

రైతు రాముని కడుపు రగిలి పోయిననాడు
సుకవితా దేహమ్ము స్రుక్కి పోయిననాడు
రాజ్యాలు గీజ్యాలు గద్దె సుద్దు లవెల్ల
రగిలి బూడిదగాక రాణించు నేరీతి ?

ఎల్ల భూములనెల్ల తల్లియై పాలించు
రైతు దైవము హృది రాజిల్లవలె హాయి
సుకవి జనములు వాని స్తోత్రించవలె సతము.

ఇదియె నా సందేశ మిదియె నా కావ్యమ్ము
ఇదియె నా శాస్త్రమ్ము ఈ ప్రపంచమునా !
ఈ ప్రపంచమునా..................

## దీపావళి

చీకట్ల కడఙిమ్ము చిన్నారి తారల్లు
చిన్నారి తారల్లు చీకట్ల చెలగాడు
ఈ భూమి చీకట్లు వెసదొల్గ జేయుటకు
తారకలునై మానవులు తనరి రండోయ్ !

చీకట్ల పొగలెగయ చిందు వెన్నెలకాంతి
చీకట్ల తారకలు చెలగాడవలె సతము
తెండు వెన్నెల దివ్వె
తెండు తారాజువ్వ
వెల్గు దీపాలెత్త విరబూయు చీకట్లు

చీకట్ల లోకమ్ము
చీకట్ల పర్వమ్ము.

చీకటిని వైదొలగ జేయు దీపాలెత్త
తారకలునై మానవులు తసరి రండోయ్ !
రండి బాలుల్లార! రండి యోధుల్లార !
రండి యువకుల్లార! రండి యువతుల్లార!
రండి దీపాలెత్త
చీకట్ల పర్వమ్ము........

## సంపూర్ణము

సంపూర్ణము కనపడలేదోయ్ !
కోరికలోనే కొరతలు గలవోయ్ !
కొరతలలోనే కోరిక కలదోయ్ !
కోరిక చాపక కొరతలు మిగిలెను.

కోరిక చావదు కొరతలు మిగులును-
సంపూర్ణ స్థితి స్వాహా రూపం !
పున్నమ చంద్రుని పోలిన మచ్చయె
కోరిక యేర్పడు తీరని దాహం.

చచ్చిననాడే పొందెద మేమొ ?
యోగులు సిదులు యెవరేగాని
సంపూర్ణ స్థితి గననే లేదోయ్ !

# మంగళము

మంగళం భవతీ ప్రపంచం
మంగళం సుమతీ స్వతంత్రం
మంగళం సర్వాత్మ శాంతికి
మంగళం అమరాత్మ శక్తికి.

మంగళం సుకవీ జనమ్ముకు
మంగళం శ్రామిక జగత్తుకు
మంగళం నాగలికి రైతుకు
మంగళం సర్వేశ్వరునకు
మంగళం శ్రీ మంగళం - జై మంగళం.

# ధన్యోస్మి

మా యమ్మను గన్న భూమి మహనీయం మహనీయం
ఈ భూమిని నేలువాడు మహనీయుడు మహనీయుడు
ఈ భూమిని బుట్టువారు మహాత్ములు మహాత్ములు
అన్నమును నేదిన్న, అన్నము నన్ను దిన్నది మన్ను యైనది.
అన్నమా ! ఇది మన్నుయా ? అనుకున్నదే వేదాంతమైనది.

M. V. KRISHNA RAO
Minister for Education & Cultural Affairs,
Executive President,
WORLD TELUGU CONFERENCE
HYDERABAD 1975

124

నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్,
మహాంకాళీ స్ట్రీట్, సికింద్రాబాద్.

M. V. KRISHNA RAO
Minister for Education & Cultural Affairs,
Executive President,
WORLD TELUGU CONFERENCE
HYDERABAD 1975

126



## ఇతర రచనలు

| | | |
|---|---|---|
| బాల గీతాంజలి | (పిల్లల నీతి పద్యాలు) | 0– 8–0 |
| ఆవేదన | (ఖండ కావ్యము) | 0–10–0 |
| సుమమాల | (ఖండ కావ్యము) | 0– 6–0 |
| విప్లవ స్వరాలు | (గేయ ఖండిక) | 1– 0–0 |

### అముద్రితములు

బుచ్చిలింగ శతకము * శ్రీరామ శతకము

---

